# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No 249 MONDAY 12th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K.NageswaraRao

# "భారత ప్రజానీక స్వప్న సాఫల్యానికి అహర్నిశలు కృషి ఒక్కటే మార్గం"

## ఆస్ట్రేలియా ఎన్నికలలో కార్మికపక్ష ఓటమి

### మితవాదులకు ఎక్కువ స్థానాలు

మెల్‌బోర్న్, డిసెంబరు 10: గడచిన 8 ఏళ్లుగా పరిపాలన సాగిస్తున్న కార్మిక ప్రభుత్వమును పడగొట్టి ఆస్ట్రేలియా ప్రజలు నేడు లిబరల్-కంట్రీపార్టీ సంకీర్ణ ప్రభుత్వ ప్రతిష్ఠాపనకు దారి చేశారు. రాత్రి వోట్లను లెక్కించడం చాలించే సమయానికి, లిబరల్-కంట్రీపార్టీకి 7 మొదలుకొని 10 దాకా దిగువ సభలో అధిక సంఖ్యాబలం లభించి ఉండవచ్చునని అంచనా వేయబడినది.

ప్రతినిధులసభ అనే దిగువ సభలో మొత్తం 123 సీట్లు ఉన్నవి; ఇందులో ఇద్దరు సభ్యులకు స్థానిక సమస్యలమీదతప్ప తక్కినవాటిమీద వోటు చేసే అధికారం లేదు. రాత్రి వోట్ల లెక్కింపు విరమించిన వేళకు ఫలితం ఎలా ఉన్నదీ అంటే కార్మికపక్షానికి నూరింట 47 95 వోట్లు లభించినవి. లిబరల్-కంట్రీ పార్టీలకు నూటికి 48 37 వంతుల వోట్లు వచ్చినవి. ఇంతవరకు లెక్కపెట్టిన వోట్లన్నీ కలిపి దేశ మొత్తంమీదఉన్న వోటర్ల సంఖ్యలో నూటికి 59 వంతులదాకా ఉంటుంది. కానయితే, ప్రజలలో అసలు ఎంతమంది వచ్చి వోట్లు వేశారు అన్నది ఇంకా లెక్క తేలలేదు.

38 మంది కమ్యూనిస్టు అభ్యర్థులుకూడా ఎన్నికలలో పోటీ చేశారు; కాని ధరావతులుకూడా కోల్పోవలసినంత తక్కువ వోట్లు వారికి వచ్చినవి.

కార్మిక ప్రభుత్వాన్ని పడగొట్టడం విషయంలో, న్యూజీలాండ్ ప్రజలఅడుగు జాడల్లోనే ఆస్ట్రేలియా ప్రజలూ అనుసరించి వెళ్ళారు. లిబరల్‌పార్టీ నాయకుడు రాబర్ట్ జి. మెంజీస్ రాత్రి 12 గంటల వేళ ఎన్నిక ఫలితాలగురించి వ్యాఖ్యానిస్తూ గెలుపు తథ్యమనే తోస్తున్నదని అన్నాడు. ఆయన అమాట అనే సమయానికి కార్మిక పక్షానికి 54 సీట్లు, ప్రతికూల పక్షాలకు 58 సీట్లు వచ్చినట్లుగా అంతవరకు అయిన కూడికలవల్ల తెలిసింది. దిగువ సభలో ఉన్న మొత్తం 123 సీట్లలోను కాన్బెరా, ఉత్తర నియోజకవర్గాల ప్రతినిధులు ఇద్దరు స్థానిక సమస్యలమీదనే వోటు చేయడానికి అధికారం ఉన్నది కాన్బెరాకు శాసనసభలో ఇప్పుడే కొత్తగా ప్రాతినిధ్యం ఇవ్వబడింది.

పాత శాసనసభలో వివిధ పార్టీలకు సంఖ్యాబలాలు ఇలా ఉన్నవి:- లిబరల్ పార్టీ 17 కంట్రీ పార్టీ 12, స్వతంత్ర కార్మిక ప్రతినిధులు 2, కార్మికపక్షం 43.

1948 లో చేసిన ఒక చట్టంద్వారా, ఈ ఎన్నికల్లో దిగువ శాసనసభ సీట్ల సంఖ్య 123 కు పెంచబడినది. రాత్రి 8 గంటలకు వోటింగు పూర్తి కాగానే వోట్లను లెక్కపెట్టడం ఆరంభించారు. ఇంతవరకు ప్రతిసారీ కార్మికపక్షానికే అధికసంఖ్యాకంగా వోట్లు ఇస్తూవచ్చిన న్యూసౌత్ వేల్సు రాష్ట్రమే ప్రభుత్వానికి ఎదురు తిరుగుతున్నట్లుగా సూచనలు ఎప్పుడైతే కనిపించినవో అప్పుడే కార్మిక పక్షం గతి సందిగ్ధావస్థలో పడ్డది.

ఆరంభంలోనే కొంచెం వెనకపడిన దరిమిలా కార్మికపక్షం ఎంత తీవ్రమైన పోటీపడి పరుగుతీసినా, లిబరల్, కంట్రీ పార్టీని చివరకు అందుకోలేక పోయింది.

ఎన్నికల ఫలితాలు ఎవ్వరు ఊహించని విధంగా పరిణమించినవనే వ్యాఖ్యానం సర్వత్ర వినపడుతోంది. కొత్త పార్లమెంటులో స్వతంత్ర సభ్యులు అంటూ ఎవ్వరూ ఉండరనీ, సంకీర్ణ ప్రభుత్వానికి ప్రతికూలపక్షంమీద 7 వోట్లకన్న మైనారిటీ ఉండదనీ అంచనా వేయబడినది.

పరిశ్రమలను ప్రభుత్వపరం చేయకూడదన్న వాదంతో, లిబరల్ కంట్రీపార్టీ ఎన్నికల్లో పోటీచేసింది 1939 మొదలుకొని 1942 వరకు సంకీర్ణ ప్రభుత్వానికి నాయకుడుగా పనిచేసి తిరిగి ఇప్పుడు ప్రధానమంత్రి కాబోతున్న లిబరల్ రాబర్ట్ మెంజీస్ ఈ విధంగా వ్యాఖ్యానించాడు: ఈ రాజకీయ సంగ్రామంలో మాకు అఖండమైన విజయం లభించిందనే చెప్పాలి. ఆస్ట్రేలియా సోషలిజమ్‌నుండి విముక్తమైనందుకు నిట్టూర్పువిడిచి కృతజ్ఞతాభావంతో భవిష్యత్ కార్యక్రమానికి పూనుకోగలం."

ప్రభుత్వము యొక్కయు, ఉద్యోగుల యొక్కయు వజ్రముష్టినుంచి ఆస్ట్రేలియా తప్పించుకొని బైటపడ్డదని ఆపనాయకుడు ఇ జె. హాంజన్ అన్నాడు.

ఎన్నికలలో కంట్రీ పార్టీవారు లిబరల్ పార్టీవారు కలిసి సంయుక్తంగా కార్మికపక్షంతో పోటీచేశారు. దిగువ సభలో గెలుపువల్ల సంకీర్ణ పక్షాలకు కలిగిన సంతోషం, ఎగువసభలో కార్మికపక్షానిదే పై చెయ్యి అయేట్లుగా కనిపిస్తున్నందున, కొంతవరకు మితపడ్డది. ఎగువసభలో కార్మికపక్షానికి 60 సీట్లలోను 33 సీట్లు వచ్చేట్లు కనిపిస్తోంది.

## యు.పి. రాజకీయ మహాసభలో ప్రధాని నెహ్రూ ఉద్బోధ

### ఏకలక్ష్యంతో జీవనప్రమాణాభివృద్ధి సాధించాలని హెచ్చరిక

ఫరూఖాబాద్, డిసెంబరు 10: నేడిక్కడ ప్రారంభమైన 34వ యు. పి. రాజకీయ మహాసభలో భారతప్రధాని పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఉపన్యసిస్తూ, భారత దేశ నూతన రాజ్యాంగాన్ని చూసి దేశీయులందరూ గర్వించదగియున్నదని చెప్పిరి. ప్రజలు వొళ్లువంచి పనిచేసి దేశాన్ని సౌభాగ్యవంతం చేయాలనీ, నూతన రాజ్యాంగాన్ని గ్రంథస్థం చేయడంతో తృప్తిచెందక దానిని సవ్యంగా ఆచరణలోకి తీసుకురావడానికి ప్రజలు పాటుపడాలనీ, ఉద్బోధించిరి.

3,700 మంది ప్రతినిధులు సభావేశంలో పాల్గొనిరి. ప్రేక్షకులతో చేరి అక్కడకూడిన జనసంఖ్య 75 వేలకుపైచిలుకుంది. యు.పి. రాష్ట్ర కాంగ్రెసుసంఘ అధ్యక్షులైన పురుషోత్తమదాసు టాండన్ గారు సమావేశానికి అధ్యక్షత వహించిరి. గోవిందవల్లభపంత్, డా॥ కేస్కార్, సక్సేనా ప్రభృతులు సమావేశానికివచ్చిరి. యు. పి. లో తనకున్న చిరకాలానుబంధంగురించి ప్రస్తావిస్తూ పండిట్ నెహ్రూ ఈ విధంగా ఉపన్యాసం ప్రారంభించెను. "యు. పి. లో గడచిన రెండు సంవత్సరాలలో రెండు మహత్తరమైన సంఘటనలు జరిగినవి. ఒకటి జమీందారీలరద్దు; రెండు పంచాయతీ రాజ్యస్థాపన. ఈ రెండు సంఘటనలు ఈ రాష్ట్రంలోని కోటానుకోట్ల ప్రజల జీవిత స్వరూపాన్ని గుర్తుపట్టలేనంతగా మార్చివేయ గలవు" నూతన రాజ్యాంగానికి స్వాగతం ఇస్తూ సభవారుచేసిన తీర్మానం గురించి ప్రస్తావిస్తూ పండిట్ నెహ్రూ ఇట్లు చెప్పెను:- "మూడేళ్ల కిందట రాజ్యాంగ రచన ప్రారంభమైనప్పుడు, పరిషత్తు జయప్రదంగా పని నెరవేర్చగలదా అని అందరూ శంకించారు, మధ్యలో పంజాబు దురంతాలు కాందిశీకుల యాతాయాతాలు ఇత్యాది ఘోర సంక్షోభాలు అనేకం సంభవించినా, పరిషత్తు ఎడతెగకుండా పనిచేసి తన సంకల్పాన్ని ఫలింపజేసుకున్నది. పరిషత్తు సాధించిన ఈమహత్ఫలితాన్ని చూచి భారతీయులందరూ గర్వించదగియున్నది. కాని రాజ్యాంగాన్ని సవ్యంగా ఆచరణలో పెట్టడానికి ప్రజలు కృషిచేయాలి. ప్రజలు తమ స్వప్నాలను వాస్తవిక జగత్తులో రూపొందించుకోవాలి అంటే, తీవ్రంగా పరిశ్రమ చేయడం ఒక్కటేమార్గం. మనంకంటున్న కలలు సర్వ దేశజాతులకు సామాన్యమైనవే. జీవిత ప్రమాణములను అభివృద్ధి చేయడమే మన ఏకాగ్రలక్ష్యం. ఐశ్వర్యసౌభాగ్యాలకు కొంతమందికి లేకుండా చేసి, కొంతమందికి మాత్రమే ప్రత్యేకించడం సాధ్యం కాదు. సౌభాగ్యం ఏవిధంగా అవిభాజ్యమో అదేవిధంగా వినాశంకూడా పృథక్కరించి ఉంచడానికి వీలులేనిది. స్వతంత్ర భారతదేశం ప్రపంచంలోఅపారమైన పరువు ప్రతిష్ఠలను సంపాదించుకున్నది. ముందు కొన్ని విదేశాలు మన శక్తి సామర్థ్యాలను శంకించినా, తరువాత తరువాత భారతప్రభుత్వము, ప్రజలు ఆయా సమస్యలను అధిగమించిన విధానాన్ని, క్లిష్ట సమయాలలో ప్రదర్శించిన ధైర్యసాహసములను గమనించి అభిప్రాయాన్ని మార్చు

2.వ పేజి చూడుడు

## ఫార్మోజాను దుర్భేద్యమైన సైనిక దుర్గంగా చేయడానికి సన్నాహాలు

### యునాన్‌రాష్ట్ర రాజధాని కమ్యూనిస్టుల వశం

హాంకాంగ్, డిసెంబర్ 10: ఫార్మోజాను దుర్భేద్యమైన సైనికదుర్గంగా చేయడానికి గట్టి ప్రయత్నాలు జరుగుతున్నాయని ఈ వేళ జాతీయచైనా కేంద్ర వార్తా సంస్థ ప్రకటించింది.

ప్రభుత్వాధికారుల కందరికీ ఆయుధాలివ్వడానికి, 30 ఏళ్లకు లోబడిన స్త్రీలందరికీ పరిచర్య శిక్షణ ఇవ్వడానికీ నిశ్చయం జరిగిందట.

ఈ ద్వీపంలో తీవ్రమైన కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం చెయ్యడానికి కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. భోగజీవనము, నీతిబాహ్యవర్తనముకూడా నిషేధింపబడగలవని తెలుస్తున్నది.

చెంగ్టూలోఉన్న జాతీయ చైనా సైన్యాధికారులలో మూడింట రెండుపాళ్లు అప్పుడే ఫార్మోజాకు ప్రయాణమైనారని తెలుస్తున్నది. మిగిలినవారు ఒకటి రెండు రోజులలో ప్రయాణమౌతారట. సమస్తంగాకు, ఫార్మోజాముగల సంబంధాలు పూర్తిగా తెగిపోయాయని తెలుస్తున్నది.

చైనాలో ఇకనించి జాతీయచైనా గెరిల్లా యుద్ధం ద్వారానే కమ్యూనిస్టులను ప్రతిఘటించగలదని తెలుస్తున్నది.

గడచిన కొద్దిరోజుల్లోను జరిగిన ఆశ్చర్యకర సంఘటనలవలన జాతీయ చైనా సైన్యాలు చిందరవందరై చెదిరిపోతున్నట్లు శరణాగతి వేడుతున్నట్లు తెలుస్తున్నది.

చెంగ్టూను జాతీయచైనా విడిచిపెట్టి వేసింది. జాతీయ చైనాకు తాత్కాలిక రాజధానిగా ఉండిన ఈ నగరం జెషూన్ రాష్ట్రంలోనిది. నిన్నరాత్రికి కమ్యూనిస్టు సేనాధిపతిసేనలు చెంగ్టూకు 30 మైళ్ళ దూరంలోనే ఉన్నాయని తెలుస్తున్నది.

పారిపోతున్న జాతీయ చైనాసేనలు జాతీయ చైనా అధీనంలో ఉన్న సికాంగ్ రాష్ట్రంలోనికి తరలి పోతున్నాయట.

చైనా ప్రధానభూభాగంలో ఇంకా తనకు అధికారం ఉన్నదని అనిపించుకో డానికి జాతీయచైనా సికాంగ్ రాష్ట్రములో ఇంకా కాలూనాలని చూస్తున్నదని తెలుస్తున్నది.

అయితే సికాంగ్ గవర్నరు కమ్యూ

(3-వ పేజీ చూడుడు)

### ఇనుము ఉక్కు ధరల తగ్గింపు

**టన్నుకు రు 30 లు**

న్యూఢిల్లీ, డిసెంబరు 10: 1949 డిసెంబరు 12 వ తేదీ నుండి అన్ని తరాల ఇనుము ఉక్కు ధరలను టన్నుకు 30 రూ. వంతున తగ్గించడానికి భారతప్రభుత్వం నిశ్చయించిందని పారిశ్రామిక శాఖ ఈవేళ ప్రకటించింది.

## రేపు 15 వ తేదీ నాటికి బటేవియా రిపబ్లికన్ సేనల స్వాధీనం

### స్వతంత్రఇండొనీషియాఅవతరణకుసన్నాహాలు

జోగ్జకర్తా, డిసెంబరు 10: హేగ్ రౌండుటేబిలు సమావేశ ఫలితంగా ఏర్పడనున్న ఇండొనీషియా రిపబ్లికు ప్రధాన పట్టణమైన బటేవియాలోకి రేపటినుండి ఇండొనీషియా రిపబ్లికుసేనలు నడవ నారంభించి డిసెంబరు 15 న స్వాధీనం చేసుకొంటవి.

ప్రస్తుతం డచ్చివారి అధీనంలో ఉన్న ఇతర పట్టణాలుకూడా ఇండొనీషియా వారికి స్వాధీనపరచడానికి తేదీలు ఈ నెలలోనే నిర్ణయమైనవి.

ఇండొనీషియా స్వాతంత్ర్య సన్నాహ సమితివారు నియమించిన శాంతిభద్రతా నిర్వాహకుడు ఇదివరకే బటేవియా, సొరబాయా (తూ. జావాలోని నౌకా కేంద్రం) సందర్శించి నేడు అధ్యక్షుడు సోకర్నోతో మాట్లాడాడు. ఇంకా ఇతర పట్టణాలను ఆయన సందర్శించనున్నాడు

అన్ని ప్రభుత్వశాఖలూ డిసెంబరు 20 లోగా ఇండొనీషియనుల వశమవుతవట.

డిసెంబరు 15 న ఇక్కడ భావి అధ్యక్షుని ఎన్నిక జరుగుతుంది. అయితే డా. సోకర్నో ఏకగ్రీవంగా ఆమోదించబడగలడనే భావం ప్రబలంగా ఉండడంచేత ఈ ఎన్నిక లాంఛనా మాత్రంగా జరుగుతుంది.

అధికార ప్రదానోత్సవాలు ఇండొనీషియా అంతటా జరపడానికి సన్నాహాలు జరుగుతున్నవి. నూతన రిపబ్లికు అధ్యక్షుడు డిసెంబరు 28 న సోత్సవంగా బటేవియా ప్రవేశించి వెంటనే

(2-వ పేజి చూడుడు)

## 'ఆంధ్రరాష్ట్రంతో ఏర్పడే బాధ్యతలను ధైర్యంతో, దీక్షతో శిరసావహించాలి'

### ఆంధ్రవిశ్వకళాపరిషత్ 23వ స్నాతకోత్సవంతో సి. ఆర్. రెడ్డిగారి ప్రబోధం

వాల్తేరు, డిసెంబరు 10: "ఆంధ్రరాష్ట్రం త్వరలో అవతరిస్తున్నందుకు మన మందరమూ ఎంతో ఆనందిస్తున్నాము. దేశ స్వాతంత్ర్యం కోసం మనమెన్ని త్యాగాలైతే చేశామో, అన్ని త్యాగాలను రాష్ట్రసంపాదన కోసం మనం చేయవలసివచ్చింది. మనం ఇకముందు గురుతరమైన అనేక బాధ్యతలను శిరసావహించవలసివున్నాము. అయినా, మన పొరుగువారితో స్నేహభావంతోనే విడిపోతాము. మనస్సులో ఏవిధమైన అసూయ, అసంతృప్తి వుంచుకోము. మన బాధ్యతలను ధైర్యంతోను, ఓర్మితోను ఎదుర్కోగలము," అని ఆంధ్రవిశ్వకళాపరిషత్ 23 వ స్నాతకోత్సవ సందర్భంలో మైసూరు విశ్వకళాపరిషత్ ప్రోఛాన్సెలర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఉపన్యసిస్తూ అన్నారు.

ఇంకా ఈ విధంగా ఉపన్యసించారు: "భాషారాష్ట్ర వాదులు పొరుగు రాష్ట్రాలలో తమ స్వభాషా ప్రజలు కొందరు ఉండటాన్ని పురస్కరించుకొని, పొరుగు రాష్ట్రాలవారిని శత్రువులను చూసినట్లుగా చూస్తున్నారు. భాషా రాష్ట్ర వాదుల వాదములను వింటే వారు తమ స్వజాతిని, స్వదేశమును త్యజించి పాకిస్థాన్‌లో కలిశారా అనిపిస్తున్నది.

ముఖ్యంగా మనదేశానికి బయటినుండి అనేకవిధాలైన ఆపదలు పొంచి చూస్తున్నవి. ఈ సమయంలో మనం అంతః కలహాలలో మునిగివున్నామనే భావం బయటివారికి కలిగేటట్లుగా ప్రయత్నించగూడదు. ఐకమత్యంగా వుండటం ఎంత ముఖ్యమైనదో ఐకమత్యంగా వున్నట్లు కనిపించటంకూడా అంత ముఖ్యమైనదే.

ఆంధ్రరాష్ట్రం మన స్వాతంత్ర్యం వలెనే ఎన్నో బాధ్యతలను తనతో కొని వస్తున్నది. రాజధానిని, శేక్ర శ్రీ బాగ్ ఒడంబడిక ప్రకారం రాజధానులను నిర్మించటానికి మనం పెట్టుబడిని ప్రోగు చేసుకోవలసి వుంది. అన్నిటికంటె పెద్దచిక్కు ధన సేకరణమే. కేంద్రప్రభుత్వం మనకు సహాయం చెయ్యకపోవచ్చును. కనుక మనం కొన్ని సంవత్సరాలవరకూ విపరీతంగా కష్టపడి పని చెయ్యాలి. సంతోషంగా, ధైర్యంగా కష్టాలను గట్టెక్కాలి. నిస్పృహకు తావులేదు.

#### తుపాను భీభత్సం

ఆంధ్రజిల్లాలలో జరిగిన తుపానుప్రమాదాన్నిగూర్చి సి. ఆర్. రెడ్డిగారిట్లా అన్నారు.

"తుపానుబాధితుల సహాయానికి ఇండియా అంతటా ప్రభుత్వాలూ, ప్రజలూ సానుభూతితో ముందుకు రావాలి. మైసూరులో సహాయకార్యకలాపం తృప్తికరంగా జరిగింది. ఉత్తరరాష్ట్రాలవారు దాక్షిణాత్యులపట్ల తగినంతసానుభూతి చూపటంలేదు. కాని వారుమాత్రం తమలక్షలకొలది రక్షణార్థులకు దక్షిణప్రాంతంలో ఆశ్రయం సహాయనిధులు ఉన్నదో లేదో ఎప్పటి కప్పుడు కనుక్కుంటూనే వున్నారు. ఇదంతా చూస్తే భారతీయులకు తామంతా ఏకైకజాతిగా, దేహంలో ఏభాగానికిదెబ్బ తగిలినామిగతా భాగాలన్నీ ఆబాధ ననుభవించినట్లు, ఏప్రాంతం వారికి కష్టం కలిగినా అది అందరికి సంభవించినట్లు భావించ గలిగే ఏకత్వము, ఆరోగ్యము ఉన్నాయా అని సందేహం కలుగుతున్నది.

ఏమైనా ఆంధ్ర విశ్వకళా పరిషత్తు తుపాను సహాయనిధిని ప్రారంభించినందుకు నేను సంతోషిస్తున్నాను. కలకత్తా హాత్యల రోజుల్లో కూడా ఈ పరిషత్తు సహాయనిధిని సేకరించింది."

#### నూత్న పట్టభద్రులు

"మన పట్టభద్రులు కేవలం జీవిత

(3-వ పేజీ చూడుడు)

## "ప్రజాభ్యుదయానికి సమితి అవసరమని రుజువైనది"

### చతుర్థ వార్షికసమావేశ పరిసమాప్తి సందర్భంలో ప్రధాన కార్యదర్శి ట్రిగ్వేలీ సందేశం

ఫ్లషింగ్ మెడోస్, డిసెంబరు 10: ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి ట్రిగ్వేలీ ఐక్యరాజ్య సమితి సమావేశం అఖరి రోజున మాట్లాడుతూ ఇల్లాగ అన్నారు.

ఈ అయిక్యరాజ్య సమితి సమావేశం వల్ల ఐక్యరాజ్య సమితి తప్పక నిర్మాణాత్మకంగా పని చెయ్యగలదనీ, తద్వారా ప్రజాభ్యుదయానికి సహకరించగలదనీ తేలింది. ఈ సమావేశంలో కోట్లకొలది ప్రజలకు సంబంధించిన నిర్ణయాలు చేశాము. ఈ నిర్ణయాలవల్లకూడా మళ్లీ ఐక్యరాజ్య సమితికి గట్టిబలం ఏర్పడుతుంది. ఇంకా అంతర్జాతీయంగా అనేకమైన రాజీసంఘాలు ఏర్పరచడానికికూడా ఈ ఐక్యరాజ్యసమితి ఉపయోగపడగలదని నా విశ్వాసము."

ఆ పిమ్మట రష్యా శాశ్వత ప్రతినిధి, అకబ్ మాలిక్ ఇల్లాగ చెప్పారు. "ఐక్యరాజ్యసమితి నాలుగవ సమావేశంలో వచ్చిన ఫలితాలు తృప్తికరంగాలేవు. అమెరికాలోను, బ్రిటనులోను, ఇంకా మిగిలిన దేశాలలోను జరుగుతున్న నూత్న యుద్ధప్రయత్నాలను చర్చించడానికికూడా ఐక్యరాజ్యసమితి అంగీకరించకపోవడమే దీనికి కారణము. ఐక్యరాజ్యసమితి చేసిన అనేకమైన నిర్ణయాలు, ఐక్యరాజ్యసమితి సిద్ధాంతాలకే వ్యతిరేకంగా ఉన్నాయి.

అయినా రష్యా ఇంతకు పూర్వంకంటె కూడా గట్టి పట్టుదలతో అంతర్జాతీయ సఖ్యతకోసమే ప్రయత్నిస్తుంది"

ఆపిమ్మట సమావేశాధ్యక్షుడు కార్లోస్ రోములో మాట్లాడుతూ ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ సహకారానికి అడ్డు వచ్చే విఘ్నాలను తొలగించి వేస్తున్నందుకు చాలా సంతోషంగా ఉన్నదని అన్నారు.

### లిబియా కమిషనరు

ఐక్యరాజ్య సర్వసభ్య సమావేశం ఈవేళ అడ్రియన్ పెల్ట్ అనే హాలెండు దేశీయుని లిబియా కమిషనరుగా నియోగించింది. రహస్యంగా జరిగిన ఎన్నికలో ఈయనకు 25 ఓట్లు వచ్చాయి. అర్జెంటైనా ప్రతినిధికి 2 ఓట్లు వచ్చాయి. పాకిస్థాన్ ప్రతినిధి మహమ్మద్ జఫ్రుల్లాఖానుకు పాపం మూడు ఓట్లు మాత్రమే వచ్చాయి!

### మాలవ్యా జన్మదినం

#### డా॥ పట్టాభిగారి ప్రకటన

ఢిల్లీ, డిసెంబర్ 10: కాంగ్రెసు అధ్యక్షులైన డా॥ పట్టాభిసీతారామయ్యగారు యీ క్రిందిరీతిగా ఒక ప్రకటన చేసిరి.

కీర్తిశేషులైన పండిత మదనమోహన మాలవ్యాగారి జన్మదినము డిసెంబరు 18 తేదీ అయినది. ఆయన భారతజాతి కర్తకు. వన జన్మదినోత్సవము జరుపుట మన కర్తవ్యము. తద్వారా ఆయన నిర్మల జీవి తాశయములను సిద్ధింపజేయుటకు యత్నించవలెను.

### ఒక లక్షా 70 వేల కరెన్సీనోట్ల గైర్హాజరీయా!

ఢిల్లీ, డిసెంబరు 10: ఒక తపాలా సంచీలో ఇన్సూరు చేసిన నాలుగు బంగీలు కలవు. వానిలో మొత్తము రు. 1,70,000 లు కిమ్మతు కరెన్సీనోట్లు కలవు ఢిల్లీ రైల్వే జంక్షనుకు వచ్చి మోటారు లారీలో నుంచి తపాలా సంచులను దింపునప్పుడు సదరు ఇన్సూరు బంగీలుగల సంచీ కన్పించలేదు. ఏ పోస్టాఫీసునుండి యీ తపాలా సంచీ మోటారులారీలో ఎక్కింపబడెనో ఆ మోటారులారీ వానికి అది ఒప్పగింపబడెను. కాని ఢిల్లీ రైల్వే జంక్షనువద్ద మోటారులారీనుండి సంచులను దింపునప్పుడు ఆ సంచీ కనిపించలేదు. ఢిల్లీ డివిజను పోస్టాఫీసుల సూపరింటెండెంటుకు రిపోర్టు దాఖలు చేయబడెను.

### కొల్లూరులో అగ్నిప్రమాదము

#### రు 7000 లు నష్టం

కొల్లూరు, డిసెంబరు 9: ఈ గ్రామములో నిన్న మధ్యాహ్నము గం. 3 లకు అగ్ని ప్రమాదము సంభవించినది. పది చావడులు, రెండు ఇండ్లు, మూడుగడ్డివాములు పరసురామప్రీతి అయినవి. నష్టం సుమారు రు 7000 ల వరకు ఉండునని అంచనా వెయ్యబడినది. తెనాలి నుండి అగ్ని మాపకయంత్రములు వచ్చి మంట లార్పినవి.

# కాశ్మీర్ తగాదాలో తనతప్పు కప్పి పుచ్చుకోడానికి పాకిస్థాన్ తాపత్రయం

## ఈజిప్టులో గుర్మాని దుష్ప్రచారం: పాకిస్థాన్ వైఖరి పరిశీలన

న్యూఢిల్లీ, డిసెంబరు 12: పాకిస్థాన్ ప్రభుత్వ కాశ్మీర్ వ్యవహారాల మాజీ మంత్రి ముస్తాఖ్ అహమ్మద్ గుర్మాని, యిటీవల కైరోలో పత్రికా విలేఖరుల సమావేశంలో పంచిపెట్టిన కరపత్రం చూస్తే, కాశ్మీర్ తగాదాలో, తన తప్పు కప్పి పుచ్చుకోవడానికి, పాకిస్థాన్ ఎలా తంటాలుపడుతున్నదీ స్పష్టంగా కళ్లకు కట్టినట్లవుతుంది.

"కాశ్మీర్ తగాదా మూలకారణాలు గాని, యథార్థములైన ముఖ్య విషయాలు గాని, యీ కరపత్రంలో పేర్కొనబడనే లేదు. 1948 జనవరిలో భారతప్రభుత్వం కాశ్మీర్ సమస్యను భద్రతామండలికి నివేదిస్తూ చెప్పిన విషయాలను పాకిస్థాన్ ప్రభుత్వం మొదట కాదన్నది కాని, తరువాత విధిలేక ఒప్పుకున్న ఐక్యరాజ్య సమితి కాశ్మీర్ కమీషన్, గత సంవత్సరం భద్రతామండలికి సమర్పించిన పారిస్ నివేదికలోగూడా, భారత ప్రభుత్వ ఫిర్యాదులో అనేక విషయాలు యథార్థములేనని ధృవపర్చింది.

కాశ్మీర్ తగాదాకు సంబంధించిన వాస్తవిక విషయాలు.

(1) కొండజాతిప్రజలు, పాకిస్థాన్ పౌరులు కాశ్మీర్‌పై దండయాత్ర చేయడం.

కాశ్మీర్ కమీషన్ తమ పారిస్ నివేదిక 22 పేజీ 66 పేరాలో యీ విషయాన్ని ధృవపరుస్తూ యిందుకు సాక్ష్యంగా సరిహద్దురాష్ట్ర గవర్నర్ సర్ ఢంబాస్ కరాచీలో జూలై 31 న యిచ్చిన వాఙ్మూలాన్ని పేర్కొన్నది. "పాకిస్థాన్ భూభాగంలోనే యుద్ధం సంభవించకుండా చేసేందుకుగాను, కొండజాతి ప్రజలకు కాశ్మీర్ త్రోవ యివ్వవలసి వచ్చిందని, వారు పాకిస్థాన్‌లోనే పెట్రోలు సంపాదించుకొన్నారని రైళ్లను మోటార్లను ఉపయోగించారని సరిహద్దు గవర్నర్ చెప్పాడు." కొండజాతి ప్రజలకు పాకిస్థాన్‌లోనే పెట్రోల్ లభ్యమైందని, పెట్రోల్ యివ్వకపోతే తీవ్రఫలితాలు సంభవించేవని ఒప్పుకుంటూ జఫ్రుల్లాఖాన్ యిచ్చిన సాక్ష్యాన్ని 66 వ పేరాలో కమీషన్ ఉదహరించింది. 119, 120, 128 పేరాలలో, కొండజాతి ప్రజలు పర్వతప్రాంతాలనుండి తూర్పుగా జమ్మూ కాశ్మీర్ సంస్థాన దక్షిణ సరిహద్దువరకూ చొచ్చుకొని వచ్చారని, నైరుతిదిశగా పాకిస్థాన్‌లోనుంచి సంస్థానంలో ప్రవేశించి శ్రీనగర్ పరిసరాల వరకూ వచ్చారని, కేవలం యుద్ధం చేసేందుకే, పాకిస్థాన్ పౌరులు జమ్మూ కాశ్మీర్ సంస్థానంలో ప్రవేశించారని కమీషన్ ధృవపర్చింది.

జమ్మూ కాశ్మీర్ సంస్థానంనుంచి తమ పౌరులను, కొండ జాతివారిని, పాకిస్థాన్ ఉపసంహరించుకొనేటట్లు చేయగలమని ఆశిస్తున్నట్లుకూడా కమీషన్ తెలిపింది.

(2) జమ్మూ కాశ్మీర్ సంస్థానంలో పాకిస్థాన్ సేనలు ఉండటం భద్రతా మండలికి తెలుపకుండా పాకిస్థాన్ యీ విషయాన్ని బుద్ధిపూర్వకంగా దాచిపెట్టడం ఈ విషయాన్ని 59 వ పేజీలో 127, 128 పేరాలలో కమీషన్ బుజువుచేసింది.

"జమ్మూ కాశ్మీర్ సంస్థానంలో పాకిస్థాన్ సేనలు ప్రవేశించాయని పాకిస్థాన్ విదేశాంగమంత్రి ప్రకటించడం తరువాత కమీషన్ వ్రాసిన లేఖకు సమాధానమిస్తూ అజాద్ కాశ్మీర్ పోరాటంలో పాల్గొనే సైన్యాలన్నీ, పాకిస్థాన్ సర్వసైన్యాధిపత్యం క్రింద ఉన్నవని ఒప్పుకోవడం, మూలంగా కమీషన్ క్లిష్టతమమైన క్రొత్త పరిస్థితి నెదుర్కొనవలసి వచ్చింది. భద్రతా మండలి జనవరి 17 వ తేదీ తీర్మాన ప్రకారం జమ్మూ కాశ్మీర్ సంస్థానంలో తమ సేనలున్నట్లు పాకిస్థాన్ భద్రతామండలికి తెల్పనేలేదు." అని 127, 128 పేరాలలో కమీషన్ వ్రాసింది.

3. కాశ్మీర్ కమీషన్ అగస్టు 13వ తేదీ తీర్మానాన్ని భారత ప్రభుత్వం ఆమోదించినా పాకిస్థాన్ నిరాకరించడం.

కాశ్మీర్‌లో పోరాటాన్ని వెంటనే నిలిపివేయుటకే అంతర్జాతీయ శాంతిభద్రతలకు ముప్పు తెచ్చే పరిస్థితిని నివారించుటకు 1948 అగస్టు 13న కాశ్మీర్ కమీషన్ ఒకతీర్మానాన్ని ప్రతిపాదించింది. ఈ తీర్మానాన్ని తాము ఆమోదిస్తున్నట్లు అగస్టు 20 న భారతప్రధాని కమీషన్‌కు వర్తమానం పంపాడు.

కొన్ని షరతులమీదనే తామీ తీర్మానాన్ని ఆమోదించగలమని చెబుతూ సెప్టెంబర్ 6న పాకిస్థాన్ విదేశాంగమంత్రి కమీషన్‌కు వర్తమానం పంపాడు. "1948 అగస్టు 13 న తీర్మానాన్ని మీ ప్రభుత్వం బేషరతుగా అంగీకరింపలేక పోయినట్లు కమీషన్ భావిస్తున్నది." అని జఫ్రుల్లాకు కమీషన్ అధ్యక్షుడు వ్రాశాడు.

4) 1949 జనవరి 1న తేదీన కాశ్మీర్‌లో యుద్ధ విరమణ జరిగింది. ఒకవంక కాశ్మీర్ కమీషన్ ఇండియా పాకిస్థాన్‌లతో కాశ్మీర్ సమస్యాపరిష్కార మార్గాన్ని గురించి సంప్రదింపులు జరుపుతుండగా, మరొకవంక కాశ్మీర్‌లోని అజాద్ కాశ్మీర్ సైన్యాలను సమీకరించి శిక్షణయిచ్చి, పాకిస్థాన్ బలపరచింది. 1949 జనవరి 5 నుంచీ అజాద్ సైన్యాల సంఖ్య పెరగనే లేదని పాకిస్థాన్ వాదము. నిజానికి, అజాద్ సైన్యాలు, పూర్తిగా పునస్సమీకరింపబడినవి. సంస్థానవాసులైన పాకిస్థాన్ సైనికులతో తదితరులతో సైన్యదళములను నిర్మించడం, వాటి పాకిస్థాన్ సైన్యస్థాయిలోకి తీసుకుని రావడం పాకిస్థాన్ సైనికోద్యోగులను అజాద్ కాశ్మీర్ సైన్యాలను నియమించడం, వాటికి కావలసిన ఆయుధసామగ్రి సేకరించడం జరిగింది. అంతేగాక యుద్ధ విరమణానంతరం, గిల్గిట్, స్కార్డూలలో క్రొత్త విమానాశ్రయాలు నిర్మింపబడినవి. ఇందుకు నిదర్శనంగా, 1949 అక్టోబర్ 10 న (అజాద్ కాశ్మీర్ అధ్యక్షుడు సర్దార్ ప్రసంగమును అక్టోబరు 11 వ తేదీ లండన్ టైమ్సుపత్రికలో చూడవచ్చును, "యుద్ధవిరమణ జరిగిన తరువాత యీ 9 నెలల్లో మా అజాద్ కాశ్మీర్ సైన్యములను పూర్తిగాపునర్నిర్మించాము. అవి మొదట్లో కాశ్మీర్‌పై దాడి చేసినప్పటికంటె యిప్పుడు శతాధికంగా బలీయమై ఉన్నవి" అని అన్నాడు.

జమ్మూ కాశ్మీర్ సంస్థానంనుంచి భారత సైన్యాలలో, విశేషభాగం ఉపసంహరింపబడే విషయంలో అలోచించేటందు సంస్థాన శాంతిభద్రతల విషయం ప్రధానంగా అలోచించాలన్నది భారత ప్రభుత్వముఖ్య లక్ష్యం.

1948 అగస్టు 20 న భారత ప్రధాని నెహ్రూ, కాశ్మీర్ కమీషన్‌కు వ్రాసిన లేఖలో యీ విషయాన్నే స్పష్టంచేస్తూ, "జమ్మూ కాశ్మీర్ సంస్థానానికి, బయట నుంచి యేవిధమైన దురాక్రమణ ప్రమాదం సంభవించడానికి వీల్లేనంతగా, అక్కడ భారతసైన్యాలు ఉండితీరాలి" అని అన్నాడు.

అజాద్ కాశ్మీర్ సైన్యాల పునర్నిర్మాణము, వేలాదిగా ఉన్న యీ సైన్యాలపై పాకిస్థాను సర్వసేనాధిపత్యము వీటి విషయం భారతప్రధాని, కమీషన్ దృష్టికి తెస్తూ అగస్టు 13 తీర్మానంలో రెండవ పేరా (A 3)లో ఉదాహృతమైన ప్రాంతాలలో యీ అజాద్ సైన్యం ఉనికి, భారతసైన్యాల ఆక్రమణ క్రింద ఉన్న ప్రాంతానికి ప్రమాదకరమని పేర్కొన్నాడు. నెహ్రూ లేఖకు కమీషన్ అధ్యక్షుడు సమాధానమిస్తూ అజాద్ కాశ్మీర్ సైన్యాలలో విశేషభాగాన్ని నిరాయుధం చేయడమే కమీషన్ ఉద్దేశ్యమని తెలిపాడు.

పాకిస్థాన్ 35 దళాలను (30 వేల సైనికులు) నిర్మించి అజాద్ కాశ్మీర్ సైన్యానికి యిచ్చిందని, యింత సైన్యం కాశ్మీర్‌లో ఉండటం సంస్థాన శాంతి భద్రతలకు ప్రమాదకరమేగాక, అంతక్రితం సంస్థానాన్ని వదలివెళ్లిన ప్రజలు, తిరిగి జనవాక్యనిర్ధారణలో పాల్గొనుటకు సాహసింపరని అందువల్ల అజాద్ సైన్యాల నిరాయుధానికి ఉద్వాసనకు తేడాలేదని భారతప్రధాని ఆపిస్కూటు జరిగిన చర్చల సందర్భంలో కమీషన్ అధ్యక్షునికి తెలిపాడు. అందుమీదట "అజాద్ కాశ్మీర్ సేనలలో "విశేష భాగాన్ని" నిరాయుధం చేయడం తమ ఉద్దేశ్యమని విశేషణం చేర్చి హామీ యిచ్చాడు.

1949 జనవరి 5 తేదీ కమీషన్ తీర్మానాన్ని భారతప్రభుత్వం ఆమోదించేటప్పుడు కమీషన్ అధ్యక్షుడు చేసిన ఈ విశేషణాన్ని బట్టి "సంస్థాన శాంతిభద్రతల దృష్ట్యాను, సంస్థానాన్ని విడిచి కాందిశీకులుగా వెళ్లిన పౌరుల పునరాగమనానికి" అజాద్ కాశ్మీర్ సైన్య ఉద్వాసన పరిష్కారంలో ముఖ్యాంశమని భారతప్రభుత్వం స్పష్టంగా అర్థం చేసుకున్నది. సంస్థానంలోని భారతసైన్యం ఉపసంహరణ కార్యక్రమానికి అజాద్ సైన్యాల ఉద్వాసనకు పరస్పర సంబంధమున్నట్లు కమీషన్ గుర్తించిందనికూడా భారత ప్రభుత్వం అర్థం చేసుకొన్నది.

(5) కాశ్మీర్‌లో యుద్ధవిరమణ 48 అగస్టు 12వ తేదీ కమీషన్ తీర్మానాన్ని పాకిస్థాన్ నిరాకరించడం మూలంగా, పరిష్కారానికి మరేవిధంగానైనా అవకాశమున్నదేమో పరిశీలించేందుకు, కమీషన్ నవంబర్‌లో తిరిగి సంప్రదింపులను ప్రతిపాదించింది. ఇందుకు భారతప్రభుత్వం ఒప్పుకొన్నది. డిసెంబర్ 11 న పారిసులో కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి కమీషన్ కొన్ని ప్రతిపాదనలు సూచించింది. వీటిని డిసెంబర్ 23 న భారత ప్రభుత్వం, 25 న పాకిస్థాన్ అంగీకరించినవి. ఈ సమయంలో కాశ్మీరులో యుద్ధవిరమణ సాధనకు భారతప్రభుత్వమే ముందుగా పూనుకొన్నది. ఉభయ అధినివేశాలు ఆమోదించిన ప్రతిపాదనలు 1949 జనవరి 5 తీర్మానంలో పొందుపర్చడానికి 4 రోజుల పూర్వమే అనగా జనవరి 1 నే యుద్ధవిరమణ అమలులోకి వచ్చింది.

### అజాద్ కాశ్మీర్ సేనలు

(6) అజాద్ కాశ్మీర్ సైన్యాలను భారత ప్రభుత్వంగాని, కాశ్మీర్ కమీషన్‌గాని, తుదకు పాకిస్థాన్‌గాని గుర్తించలేదు.

అజాద్ కాశ్మీర్‌ను గుర్తించడం, అజాద్ కాశ్మీర్ ఉద్యమాన్ని గుర్తించడమే అవుతుందని, కమీషన్ ఆపని చేయజాలదని చెప్పగా, అందుకు పాకిస్థాన్ విదేశాంగమంత్రి ఒప్పుకున్నాడని, అసలు, ఆయన ప్రభుత్వం కూడా, న్యాయచట్టరీత్యా అజాద్ కాశ్మీరును గుర్తించలేదని కాశ్మీర్ కమీషన్ తమ నివేదిక 61 వ పేజీ 182 పేరాలో వ్రాసింది.

(7) జనవాక్యనిర్ధారణకు పాకిస్థాన్ నిరాకరణ.

అంతర్జాతీయాధిపత్యం క్రింద సంస్థాన ప్రజల అభీష్టాన్ని తెలుసుకొని కాశ్మీర్ భవితవ్యాన్ని నిర్ణయించాలని తెలియజేసింది. భారత ప్రభుత్వంగాని పాకిస్థాన్‌గాని నవంబర్ 1 తేదీ రాత్రి కాశ్మీర్‌కు భారతసైన్యాలను పంపేటప్పుడు, భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ "సంస్థానాన్ని రక్షించి పిమ్మట ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యాన, జనవాక్యమును నిర్ధారిస్తామని" వాగ్దానం చేశారు.

ఆ మరుసటి రోజున పాకిస్థాన్ ప్రధానికి తంతి పంపుతూ యీ వాగ్దానాన్నే పునరుద్ఘాటించాడు.

ఈ వాగ్దానాన్ని పాకిస్థాన్ ప్రధాని లియాఖత్ ఆలీఖాన్ నిరాకరిస్తూ "ఓటర్లను వాళ్ల జన్మస్థానాలనుంచి తరిమివేసినప్పుడుగాని లేదా వాళ్లను చంపివేసినప్పుడుగాని" జనవాక్య నిర్ధారణవల్ల ప్రయోజనమేమిటి, అని నవంబర్ 4 న ఖడ్ కొట్టు ప్రసంగంలో అన్నాడు.

కాశ్మీర్‌లో వీలైనంత త్వరలో జనవాక్యం యేర్పాటు చేయవలసిందిగా ఐక్యరాజ్య సమితిని సంయుక్తంగా కోరుదామని భారత ప్రధాని పాకిస్థాన్ ప్రధానికి 47 న నవంబరు 8 న మరొక తంతి పంపాడు. కాని పాకిస్థాన్ నుండి సమాధానం లేదు.

ఈ పై విషయాలు గూర్చి తెలిపేగూడా "1947 నవంబర్‌లోనే కాశ్మీర్ తగాదాను సమితితీర్పుకు నివేదించుదామని పాకిస్థాన్ భారత ప్రభుత్వానికి సూచించిందని, యీతగాదాలో సమితి మధ్యవర్తిత్వం వహించ వీలులేదని భారత ప్రధాని చెప్పాడని," పాకిస్థాన్ కాశ్మీర్ వ్యవహారాల మంత్రి గుర్మానీ ఆరోపించాడు.

1947 అక్టోబర్ 31 షేక్ మహ్మద్ అబ్దుల్లా జమ్మూ కాశ్మీర్ ప్రధాని పదవిని స్వీకరించే సందర్భంలో మాట్లాడుతూ" దుండగులు ప్రయోగించే బలాత్కారానికి లొంగలేము, అలాలొంగుట ఆత్మగౌరవానికి భంగకరము కనుక కాశ్మీర్ సంస్థానం యే అధినివేశంలో చేరేదీ సంస్థాన ప్రజాభీష్టమునకు వదులుతూ, ప్రజాస్వామ్య సిద్ధాంతమును అంగీకరించవలసిందిగా జిన్నాను కోరుచున్నాను. తన పలుకుబడిని ఉపయోగించి దుండగులను ఉపసంహరించవలసిందిగాకూడా ఆయనకు విజ్ఞప్తి. అవసరమైతే నేను కరాచీకిరా సిద్ధముగా నున్నాను" అని ప్రకటించాడు. ఇందుకు పాకిస్థాన్ సమాధానమేమీ లేదు.

### యథాతథపు ఒడంబడిక

కాశ్మీర్ సంస్థానాధిపతి భారత ప్రభుత్వంతో యథాతథపు ఒడంబడిక చేసుకుంటానని వర్తమానం పంపాడు. కాని అలాంటి ఒడంబడి కేమీ కుదురలేదు. కాని పాకిస్థాన్, కాశ్మీర్ సంస్థానాధీశుడు యథాతథపు ఒడంబడిక కుదుర్చుకొన్నారు. అయితే యీ యథాతథపు ఒడంబడిక ప్రకారం సంస్థానరక్షణ, విదేశాంగ వ్యవహారాలు రాకపోకలపై తమకు అధిపత్యం ఉన్నదని పాకిస్థాన్ వాదించడం, 1948 జనవరిలో భద్రతామండలికి పాకిస్థాన్ కాశ్మీర్‌తో తాను చేసుకొన్న యథాతథపు ఒడంబడిక స్వభావానికిగాని 48 జనవరి 17 న మండలిలో విదేశాంగ మంత్రి జఫ్రుల్లాఖాన్ యీ ఒడంబడిక స్వభావాన్ని ధృవపరుస్తూ చేసిన ప్రసంగానికిగాని విరుద్ధం.

కాశ్మీర్ సంస్థానాధిపతి ఉభయ అధినివేశాలతో యథాతథపు ఒడంబడికను వాంఛిస్తూ పాకిస్థాన్ భారత ప్రభుత్వాలకు 1947 అగస్టు 15న తంతి వర్తమానములు పంపాడు. బ్రిటిష్ ఇండియన్ ప్రభుత్వంతో తమకు యేయేవిషయములపై ఒడంబడిక ఉన్నదో వాటిపైనే యథాతథపు ఒడంబడిక చేసుకుంటానని, వివరాలకు సంబంధించి క్రొత్త ఒడంబడికలు కుదిరేవరకు, యీ ఒడంబడిక అమలులో ఉంటుందని స్పష్టంచేశాడు. ఇందుకు పాకిస్థాన్ ఒప్పుకొన్నది. సంస్థానాధిపతి తన తంతిలో పేర్కొన్న ఒడంబడిక, ఎగుమతి దిగుమతి సుంకములు తంతి తపాలా మొదలగు వాటికి సంబంధించిందే గాని రక్షణ, విదేశాంగ వ్యవహారాలకు సంబంధించినది గాదు. పాకిస్థాన్‌గూడా భద్రతామండలికి తాము సమర్పించిన నివేదిక 15 వ పేరాలో ఒప్పుకొన్నది కనుక, యథాతథపు ఒడంబడిక రక్షణ, విదేశాంగ వ్యవహారాలకు గూడా వర్తిస్తుందని పాకిస్థాన్ అనుకొన్నట్లయితే 47 అగస్టు 15 తరువాత కాశ్మీర్ ప్రభుత్వానికి పాకిస్థాన్‌కు నడచిన అనేక తంతి వర్తమానాలలో యీ ప్రసక్తే ఎందుకు లేదు.

సంస్థానాధిపతి అభీష్టంతో యథాతథపు ఒడంబడిక కుదుర్చుకొని పాకిస్థాన్ సంతృప్తిపడితే సంస్థాన ప్రజాభీష్టం ప్రకారం కాశ్మీర్, అటు పాకిస్థాన్‌లోగాని, భారత యూనియన్‌లోగాని యథేచ్ఛగా చేరాలని భారతప్రభుత్వం పట్టుదల పట్టింది. కాశ్మీర్ యే పరిస్థితుల్లో భారత యూనియన్‌లో చేరవలసి వచ్చిందీ లాహోర్ వారపత్రిక 'ఇమాన్' లో బాక్షి వివరిస్తూ సంస్థాన ప్రజా రాజకీయ ఉద్యమాలతో కాంగ్రెస్‌కు ప్రత్యక్ష సంబంధం ఉండగా ముస్లింలీగ్‌కు అది లేదని, అదిగాక ముస్లింలీగ్ నిరంకుశుడైన మహారాజాకే సమర్థిస్తూ ఆయన సహాయంతో సంస్థానాన్ని పాకిస్థాన్‌లో చేర్చడానికి ప్రయత్నించిందనీ, కాబట్టి భారత యూనియన్ సంస్థాన ప్రజాఉద్యమం తోడ్పాటుగాని, మహారాజా తోడ్పాటేమీ లేదని వ్రాశాడు.

అబ్దుల్లా జాతీయ మహాసభ 18 యేండ్లుగా సంస్థాన విమోచనకు పనిచేస్తూ ప్రజాభిమానం చూరగొన్నదని, సంస్థానంలో నామరూపాలులేని లీగ్ అబ్దుల్లాతో సమాధాన పడకుండా, దుండగుల సహాయంపై ఆధారపడటం మేలని ఎంచిందనికూడా యీయన వ్రాశాడు.

(10) పాకిస్థాన్ భారత ప్రాంతాలలో మతకలహాలు చెలరేగుతూ ఇప్పుడు సిక్కులు, హిందువులు, ముస్లింలుగూడా కాందిశీకులుగా కాశ్మీర్‌లోకి వచ్చారు. అయినా ఒక్క మతకలహ సంఘటనగూడా జరుగలేదు. 47 అక్టోబర్ 4 వ తేదీన అబ్దుల్లా శ్రీనగర్ బహిరంగసభలో మాట్లాడుతూ, జాతీయ మహాసభ కార్యకర్తల నిర్విరామ కృషి ఫలితంగా ఒక మతకలహ సంఘటనగూడా జరుగనందుకు యిందుకు భగవంతునికి ధన్యవాదాలర్పిస్తున్నానని అన్నాడు.

### దుండగుల ఘోర హింసా కృత్యాలు

(11) కాశ్మీర్‌కు విముక్తి కల్పించడానికివచ్చామని పైకిచెబుతూ, సంస్థానంలో కొండజాతి దుండగులు దారుణ హింసాకాండ సాగించారు. హత్యలు, దోపిడీలు, మానభంగాలు, గృహదహనాలు వీటికి అంతులేదు. వీటికి ఒక్క ముస్లిమేతరుల పైనేగాదు ముస్లింలు క్రిస్టియన్లుగూడా గురియైనారు. దారములలో వారి ఘోర కృత్యాలు వర్ణనాతీతం.

### గుర్మాని దుష్ప్రచారం

కాశ్మీర్ తగాదాలో, భారతప్రభుత్వంపై దుష్ప్రచారంచేస్తూ పాకిస్థాన్ కాశ్మీర్ వ్యవహారాలమంత్రి, ముస్తాఖ్ మహమ్మద్ గుర్మాని కైరో పత్రికా విలేఖరుల సమావేశంలో యిలా ప్రసంగించాడు.

"పాకిస్థాన్ ఎదుర్కొంటున్న సమస్యలన్నింటిలోని ముఖ్యాతి ముఖ్యమైన సమస్య కాశ్మీర్ విషయంలో భారత ప్రభుత్వంతో తగాదా. అన్నసంగతి మీకు తెలిసిందే 1947 అగస్టు 15 వ తేదీన భారత సంస్థానాలపై బ్రిటిష్ సార్వభౌమత్వం అంతరించినప్పుడు, భౌగోళిక సామీప్యతను, ఆర్థిక పరిస్థితులను ప్రజాభీష్టములను గమనించి, ఏదో అధినివేశంలో చేరిపోవలసిందిగా సంస్థానాధిపతులకు సలహా యివ్వబడింది. ఈ సలహా ప్రకారం, జమ్మూ కాశ్మీర్ సంస్థానాధిపతి పాకిస్థాన్‌తో 47 అగస్టు 15న యథాతథపు ఒడంబడిక కుదుర్చుకొన్నాడు. ఈ ఒడంబడిక ఫలితంగా సంస్థానరక్షణ, రాకపోకలు విదేశాంగ వ్యవహారాలు పాకిస్థాన్ ప్రభుత్వాధిపత్యం క్రిందకు వచ్చినవి.

కాని తరువాత మహారాజా హిందూ సలహాదార్లతోకలసి కుట్రపన్నాడు. ఇటీవల అనుభవాన్ని బట్టి, అధికసంఖ్యాకులను, నిర్నిక్షేపమైన పంథాలో నిర్విరామ కృషివల్ల సర్వనాశనం చేయవచ్చునో తేలింది. నూటికి 62 మంది ముస్లింజనాభా గల కపుర్తలా సంస్థానం, ఆర్. యస్. యస్., సిక్కు ముఠాల సహాయంతో ముస్లిం ప్రజలను నాశనం చేయగలిగింది. కాశ్మీర్‌లోగూడా యిలాంటి విధానం అనుసరిస్తే, సంస్థానాన్ని భారత యూనియన్‌లో చేర్చుటకు మహారాజుకు త్రోవ యేర్పడుతుంది. ఆప్రకారం, ఆర్.ఎస్.ఎస్. వారికి సిక్కు పాంథికులకు, సంస్థానంలో ప్రవేశం యిచ్చాడు. వారు సంస్థానంలో అసంఖ్యాకంగా ప్రవేశించి తమ స్థానం బలపర్చుకొనే యీలోగా ముస్లిం ప్రజలకు అనుమానం కలుగకుండా, పాకిస్థాన్‌తో యథాతథపు ఒడంబడిక కుదుర్చుకొని వ్యవధికోసం మహారాజు టెంటాలు పడ్డాడు. అయితే మహారాజు సంకల్పం అనుకొన్నట్లు సిద్ధించలేదు. సంస్థాన పోలీసు మిలిటరి బలగాలతో కలసి సాయుధ ముఠాలు సాగించే హత్యాకాండకు ప్రజలు తల ఒగ్గలేదు. ఈ హత్యాకాండ గురించి అక్టోబర్ 10న టైమ్సు పత్రిక "డోగ్రా ప్రాంతంలో 287 వేల మంది ముస్లింలు సంస్థానం నుంచి తరిమి వేయబడినారని" వ్రాసింది.

ప్రాణాలకు తెగించవలసి వచ్చిన యీ సమయంలో మహారాజుపై ప్రజలు తిరుగబడ్డారు. అసంఖ్యాక ప్రజలు పాకిస్థాన్‌కువచ్చి చేతికి దొరికిన ఆయుధాలు పుచ్చుకొని కాశ్మీర్ పైకురికారు. మహారాజా సైన్యాలు తరిమి వేయబడినవి. మహారాజాగూడా జమ్మూకు పలాయనమైనాడు. ఈ పరిస్థితుల్లో శిథిలావస్థలోనున్న మహారాజా ప్రభుత్వ పునరుద్ధరణకు, కృత్రిమ ఒడంబడికను కుదుర్చుకొని" భారత ప్రభుత్వం సంస్థానానికి సైన్యాలు పంపింది. ఇలా కాశ్మీర్ సంస్థానాన్ని భారత యూనియన్‌లో చేర్చుకోవడం, అదివరకు మహారాజా పాకిస్థాన్‌తో చేసుకొన్న ఒడంబడికకు విరుద్ధం. కాశ్మీర్ సంస్థానం, భౌగోళికంగా, ఆర్థికంగాసంస్కృతి, జాతి, సంప్రదాయాల, మతం మొదలగు వాటి రీత్యాగాని, రాజకీయంగా గాని, అంటే ప్రజాభీష్టాన్ననుసరించిగాని ఏ విధంగా చూచినా పాకిస్థాన్ అంతర్భాగమే.

భౌగోళికంగా భారత యూనియన్‌కు కాశ్మీర్‌కు సంబంధంలేదు. పెద్ద పర్వత శ్రేణులు రెంటికి వేరు చేస్తున్నవి.

జనాభా విషయం నూటికి 80 మంది ముస్లింలు.

భౌగోళిక, ఆర్థిక పరిస్థితులను గూడా నిర్లక్ష్యంచేసి, (పాకిస్థాన్‌తో సంస్థానము యథాతథపు ఒడంబడిక చేసుకొని ఉన్నప్పటికీగూడా) మహారాజా సంతకం చేసిన అధికార దఖలు పత్రమును కృత్రిమ సాధనాన్ని ఆసరాగా తీసుకొని, మా సోదరులనుండి మమ్ము విడదీయుటకు భారత ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. కాశ్మీర్ ప్రజలు మాతో ఉండాలని కోరుతున్నారు. ఇవన్నీ భారతప్రభుత్వానికి అర్థరహితంగా కన్పిస్తున్నవి.

కాశ్మీర్ తగాదాను, ఐక్యరాజ్యసమితి తీర్పుకు నివేదిద్దామని 1947 నవంబర్‌లోనే పాకిస్థాన్ ప్రభుత్వం భారత ప్రభుత్వానికి సూచించింది. ఐక్యరాజ్యసమితి గాని భద్రతామండలి గాని యీ తగాదాలో జోక్యం కల్పించుకో వీల్లేదని భారత ప్రధాని సమాధానమిచ్చాడు. ఈ సమాధానమిచ్చి, పాకిస్థాన్‌కు తెలియకుండా 48 జనవరిలో కాశ్మీర్ సమస్యను భద్రతామండలికి నివేదించాడు. తనకు తెలియకుండా జరిగిన యిలా జరగడం పాకిస్థాన్‌కు సంతోషకరమే అయింది. జమ్మూ కాశ్మీర్ తగాదా ప్రజాభీష్టముపై పరిష్కరింపబడవలెననిభద్రతామండలి తీర్మానించింది. ఇందుకు ఒక కమీషన్ నియమించింది. కమీషన్ కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి కొన్ని తీర్మానాల రూపంలో ఒక పథకాన్ని తయారుచేసింది. దానిని ఇండియా పాకిస్థాన్‌లు ఆమోదించాయి. ఈ తీర్మానంలో మూడు భాగములలో మొదటిది యుద్ధవిరమణ: రెండవది భారత పాకిస్థాన్ సైన్య ఉపసంహారం; మూడవది జనవాక్య నిర్ధారణ.

ఈ పథకం ప్రకారం 1949 జనవరి 1 న యుద్ధవిరమణ జరిగింది.

పథకంలో రెండవభాగం ప్రకారం పాకిస్థాన్ తన సైన్యాలను ఉపసంహరించుటకు ఒప్పుకున్నదిగాని భారత ప్రభుత్వం తన సైన్యాలను ఉపసంహరింప నిరాకరించింది. ఈ విషయాన్ని మధ్యవర్తి పరిష్కారానికివదలాలనికమీషన్ సూచించింది. మధ్యవర్తిగా అడ్మిరల్ నిమిట్జ్‌నుసూచించింది. నిమిట్జ్‌ని మధ్యవర్తిగా స్వీకరించాలని ట్రూమన్ విజ్ఞప్తిచేశారు. ఇందుకు పాకిస్థాన్ ఒప్పుకున్నది కాని భారత ప్రభుత్వం నిరాకరించింది.

అసలు ముఖ్యవిషయం యిది. ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా తన సైన్యాలను జమ్మూ కాశ్మీర్‌కుపంపి ఇండియా దురాక్రమణ జరిపింది. తన ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవాలని అభిలషిస్తున్నది. ఇందుకు నిష్పాక్షిక జనవాక్య నిర్ధారణే పరిష్కార మార్గం. అందుకు అనువైన పరిస్థితులు యేర్పడాలి. పాకిస్థాన్ కోరేది యీ నిష్పాక్షిక జనవాక్యనిర్ధారణే.

కాని యీ ఘట్టంలో శాంతి పరిష్కారకబుర్లు చెబుతూ, తన దురాక్రమణను ప్రపంచం ఆమోదించేటట్లు చేసుకోవాలని భారత ప్రభుత్వ ప్రయత్నం.

### మండలిలో చర్చ

ఫ్లషింగ్ మెడోస్, డిసెంబరు 10: ఇక్కడ సర్వప్రతినిధిసభా సమావేశాలు పరిసమాప్తికి రావడంచేత భద్రతా మండలి సమావేశాలకు ప్రాముఖ్యం హెచ్చసాగింది.

భద్రతామండలి సోమవారం నాడు సమావేశమై ఇండోనీషియా ఒడంబడికను ఆమోదించి, డిసెంబరు 17 లోగా ముగించి కాశ్మీరు కమిషనువారి 3 వ తాత్కాలిక నివేదికపై చర్చసాగిస్తారు. ఈ సమస్య సాధ్యమైనంత త్వరలో ముగించాలనే ఉద్దేశంతోనే డిసెంబరు 17 శనివారమైనప్పటికీ భద్రతామండలి సమావేశం ఆనాడు జరుగుతున్నది.

కాశ్మీరు కమిషను సభ్యులు పై వారంలో ఇక్కడికిచేరి తమ సాక్ష్యమూ నివేదికా తమ అధ్యక్షునిద్వారా భద్రతా మండలికి నివేదింపజేస్తారు. కమిషనుకు చెందిన ఇతర సభ్యులు అవసరమైనప్పుడు పిలువబడవచ్చు.

ఈ సందర్భంలో అజాద్ కాశ్మీరు ప్రభుత్వాధ్యక్షుడు సర్దారు మహమ్మదు ఇబ్రహీంఖాన్, తన పత్రికా సలహాదారు ఇస్లాంతో సహా.

కాశ్మీరు కమిషను నివేదికపై భద్రతా మండలిలో చర్చ జరిగేటప్పుడు నవాబు గుర్మానీ పాకిస్థాను పక్షాన మాట్లాడతాడు.

### పాకిస్థాన్ మంత్రి ప్రకటన

లండన్, డిసెంబరు 10: కాశ్మీర్ వ్యవహారాలలో పాకిస్థాన్ మంత్రిగానున్న నవాబ్ ముస్తాక్ అహ్మద్ గుర్మానీ, ఈ వేళ ఇక్కడ మాట్లాడుతూ, కాశ్మీర్ వివాదం త్వరలో పరిష్కరించాలనీ, తద్వారా ఇండియా పాకిస్థాన్‌లలో శాంతి పరిస్థితులు ఏర్పరచాలనీ అన్నారు.

గుర్మానీ న్యూయార్కు వెళ్లేముందు ఈ విధంగా అన్నారు." ఈజిప్టు మొదలయిన దేశాలుదర్శించిన తరవాత కాశ్మీర్ వివాదం త్వరలో పరిష్కరించవలసిన అవసరం అందరికీ బాగా తెలిసింది.

కాశ్మీర్ వివాదం జాగ్రత్తగా అర్థం చేసుకుంటే రాజీ షరతులలోనే అభిప్రాయభేదం ఉన్నట్టు స్పష్టమౌతుంది.

భద్రతామండలి ఈసమస్య జాగ్రత్తగా పరిష్కరిస్తే కాశ్మీరవివాదం శాంతంగా పరిష్కరించవచ్చును.

## పాకిస్థాన్ ప్రధానికి ట్రూమన్ ఆహ్వానం

పెషావరు, డిసెంబరు 10: పాకిస్థాను ప్రధానమంత్రి యగు లియాకతాలీఖాను గారు వచ్చేసంవత్సరము మే నెలలో ఒక పర్యాటనము వాషింగటను నగరమునకు విచ్చేయవలసినదిగా అమెరికా ప్రెసిడెంటయిన ట్రూమను గారు ఆయన సతియును ఆహ్వానమును పంపిరని నేడిచట వెల్లడి చేయబడెను. ఈ ఆహ్వానమును లియాకతాలీఖాను గారు అంగీకరించిరని తెలియుచున్నది. లియాకతాలీఖానుగారు సతీసమేతంగా అమెరికాకు వెళ్ళెదరు.

## మొహమాండుల పోరాటం"

ఢిల్లీ, డిసెంబర్ 10: కాబూలు రేడియో యిట్లు ప్రకటించుచున్నది.

వార్సాకువద్ద ఒక ఆనకట్టను నిర్మించవలెననే మిషతో ఖ్వాజాజాయిప్రాంతము నందు పాకిస్థాను ప్రభుత్వము సైనికదళములను కొన్ని అచట మకాము చేయించెను. అచటి మొహమాండు తెగలవారు పాకిస్థాను సేనలు దురాక్రమణ చేయకుండా ఎదిరించి పోరాడుచున్నారు. మొహమండు తెగలవారందరు, ఖ్వాజాజీవద్ద సమావేశమై కర్తవ్యమునుగూర్చి అలోచించిరి. అందరు ఏకగ్రీవముగా ఒక నిర్ణయము చేసిరి. పాకిస్థానుయొక్క దురాక్రమణ నరికట్టుటకు ప్రతి వ్యక్తియును పోరాడవలెననియు ఈ పోరాటములో ప్రాణములిచ్చువారికే త్యాగమూర్తి యని తీర్మానించిరి.

## చింతకాని రైల్వే స్టేషన్‌మాస్టరు అరెస్టు వార్త

### నిజాంసంస్థాన రైల్వే ప్రకటన

సికింద్రాబాద్, డిసెంబరు 10: నిజాం సంస్థానరైల్వే ఇంజనీరు షేగాల్ హత్యకు దారితీసిన కుట్రలో సంబంధమున్నదనే అనుమానంపై చింతకాని రైల్వేస్టేషన్ మాస్టరు రంగయ్యగారిని స్థానిక పోలీసులు అరెస్టు చేశారన్న వార్త అబద్ధమని నిజాం సంస్థాన రైల్వేవారు ఒక ప్రకటన చేస్తున్నారు.

## రైలుబండిలో ప్రయాణీకురాలి హత్య

విశాఖపట్నం, డిసెంబరు 11: ఖుర్దా రోడ్డునుండి వాల్తేరుకు వచ్చే పాసెంజరు బండిలో గడచిన అర్ధరాత్రివేళ సెకండు క్లాసులో ప్రయాణంచేస్తున్న ఒక స్త్రీ పొడువబడింది. మరొక స్త్రీకి తీవ్ర గాయములు తగిలినవి. దుండగుడొకడు ఒక స్టేషనులో ఎవరికీ తెలియకుండా ఆడవారి సెకండుక్లాసు పెట్టెలో ప్రవేశించాడనీ, ఒక యువతిని కత్తితో పొడిచి, ఆమెను క్రిందికి విసిరివేశాడనీ, మరొక స్త్రీనికూడా పొడిచి పోతూపోతూవున్న రైలునుండి దూకాడనీ తెలుస్తున్నది. ఆ దూకటంలో అతనికి మోకాలిచిప్ప తొలిగిపోయి, పారిపోలేకపోయాడు.

గాయపడిన రెండవ స్త్రీ రైలులోనే వుండి ఉర్లాంస్టేషనుగానే అధికారుల కీవిషయం తెలియజేసింది. దుండగుని, పొడువబడిన యువతిని ఉర్లాంస్టేషనుకు తీసుకువచ్చారు. యువతి కొన ఊపిరి ప్రాణంతోవుండి కొంతసేపటికి చనిపోయింది. రెండవ స్త్రీ చికిత్సపొందుతున్నది. దుండగుడు రైల్వేపోలీసులకప్పగింపబడ్డాడు.

## మద్రాసు భవిష్యత్తు

### రంగాగారి వివరణ

సికింద్రాబాద్, డిసెంబరు 11: "ఆంధ్రులు మద్రాసునగరంపై హక్కులను వదులుకొన్నారు. అయితే అది ఒకచీఫ్ కమిషనర్ రాష్ట్రంగా ఏర్పాటుచేయబడవలెనని వారివాంఛ" అని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ ఎన్. జి. రంగాగారు మొన్న సాయంకాలం నిజాంకళాశాల విద్యార్థులసభలో ప్రసంగిస్తూ అన్నారు.

రంగాగారు తమ ప్రసంగమును కొనసాగిస్తూ, కాంగ్రెస్ అధిష్ఠానవర్గం మద్రాసు భవిష్యత్తునుగురించి యింతవరకు ఎటువంటినిర్ణయానికి రాలేదన్నారు.

"కాంగ్రెస్ అధిష్ఠానవర్గం మద్రాసు నగరాన్ని చీఫ్‌కమిషనర్ రాష్ట్రంగా చేయుటకు నిర్ణయిస్తేనుంచికే. అట్లాగాక తమిళనాడులో భాగంగా ఉండాలని నిర్ణయిస్తే మద్రాసు తమిళనాడులో భాగముగా వుంటుంది." అని రంగాగారన్నారు.

## ప్రధానినెహ్రూ ఉద్బోధ

1 వ పేజీ తరువాయి

కున్నారు. అయితే ఈపరిణామం మన జాతి పిత గాంధీమహాత్ముని నాయకత్వం వల్లనే సాధ్యమైంది. ప్రజలు వళ్లు వంచి పనిచేసి దేశములో ఐశ్వర్య సౌభాగ్యాలను సృష్టించాలి. దేశాన్ని ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించడానికి ఇంతకన్న దగ్గర దోవలేదు.

ఆదాయాన్ని మించి వ్యయం చేసే ఏ దేశమైనా దివాలా తీయక తప్పదు.

దొంగ వ్యాపారాన్ని లంచగొండితనాన్ని ప్రభుత్వం ఒక్కటే చేతిమీదుగా నిర్మూలించాలి అంటే అది సాధ్యమయ్యే పనిగాదు. ఈ చెడుగులన్నిటినీ నిర్మూలించడానికి ప్రజలుకూడా పట్టుదలతో ప్రయత్నించి సహకరిస్తేనే అది వల్లనవుతుంది.

భారతదేశం అభ్యుదయం చెందాలంటే రెండు సంగతులను ముఖ్యంగా మనసులో పెట్టుకోవాలి. చిత్తశుద్ధి సాధించాలన్నది ఒకటి. అవిశ్రాంతంగా పనిచేయాలన్నది రెండు." పురుషోత్తమదాసు టాండన్ గారు అధ్యక్షోపన్యాసంచేస్తూ, మతాల ఘర్షణ వినాశానికి దారితీస్తుందనీ, దేశములో ఉన్న వివిధ మతాలవారు ఒక సామాన్య సంస్కృతిని సృజించుకోవడం ఆవశ్యకమనీ చెప్పిరి.

## బటేవియా రిపబ్లిక్ సేనల స్వాధీనం

(1-వ పేజీ తరువాయి)

స్వాతంత్ర్య ప్రకటన ప్రజలకు చదివి వినిపిస్తాడు.

అధికార ప్రదానం నాడు బటేవియాలో డచ్చిసేనలూ, ఇండోనీషియా సేనలూ కలసి పెరేడు చేస్తాయట. ఉభయ దేశాలమధ్య ఉండే సహకారానికి ఇది చిహ్నంగా ఉంటుందట.

నూతన ప్రభుత్వం నెలకొల్పి ఇండోనీషియా ప్రధాని డిసెంబరు 20 ప్రాంతాల హాలెండుకు వెళ్లి డిసెంబరు 27 న జూలియానా రాణివద్ద ఇండోనీషియా స్వాతంత్ర్య పత్రం పుచ్చుకొంటాడట.

## రిపబ్లికు ప్రతిష్ఠాపన

### అమృతకౌరు ప్రయాణం

ఢిల్లీ, డిసెంబరు 10: ఇండోనీషియాలో నూతన ప్రజాస్వాతంత్ర్య ప్రభుత్వ ప్రతిష్ఠాపన మహోత్సవ సందర్భములో డిసెంబరు ఆఖరువారములో ఇండోనీషియాకు పండిట్ నెహ్రూ గారిని రావలసినదిగా ఆహ్వానించిరి. కాని స్వదేశమును విడిచి ఆవారంలో రాజాలనని నెహ్రూగారు తెలియజేసిరి. వారికి బదులుగా ఇండియా ప్రభుత్వ ఆరోగ్యశాఖమంత్రి రాజకుమారి అమృతకౌరుగారు ఇండోనీషియాకు వెళ్లెదరు.

# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 13 మంగళవారం

## మద్రాసు (ఎ)

ఉ 7-30 టి. ఆర్. శ్రీనివాసన్ పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం (రి). 8-30 మద్రాసు (బి) వలె. మ 1 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం (రి). 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా 5-30 వేణుగోపాల్ వయొలిన్. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 వి. ఎం. కృష్ణమూర్తి పాట. 7-30 గీత మంజరి (రి). 7-45 మస్నార్ సుడి కె. సావిత్రి అమ్మాళ్. గోటువాద్యం. 9 ఆంగ్లమున వార్తలు. 9-30 మద్రాసు (బి) వలె. 10 వాద్యసంగీతం (రి).

## మద్రాసు (బి)

ఉ 7 తెలుగున వార్తలు. 7-45 అనంతలక్ష్మి శఠకోపన్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 టి. ఎస్. జ్ఞానాంబాల్ పాట. మ 12. కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు ప్రసిద్ధవైజ్ఞానికులు. డాల్టన్. ప్రసంగం ఎం. ఎల్. నరసింహారావు ప్రశ్నలు. జవాబులు. 1 మహిళా మండలి. పాడవోయి ప్రయాణికుడా-గేయం. జగత్కుటుంబము. ప్రపంచ ఆరోగ్య సంఘం. ప్రసంగం. ఎ. చెన్నగంటమ్మ కృష్ణారావు. ఇది చేసిచూడండి పంజాబీభక్ష్యాలు. ప్రసంగం చావలి లింగమాంబ. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. కవితా సమయములు. కృతికర్త ప్రశంస. ప్రసంగం. దేవులపల్లి కృష్ణశాస్త్రి. బృందగానము. టి. టి. వి. ఉన్నత పాఠశాలా. 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. ప్రయాణ గాథ. గాలిలో. ప్రసంగం. కె. సూర్యనారాయణ. మన దేవాలయములు, తిరుక్కాళహస్తి దేవాలయము ప్రసంగం. మల్లంపల్లి సోమశేఖరశర్మ. బృందగానము బిసెంటుథియసాఫికల్ పాఠశాల సా. 5-30 మద్రాసు (ఎ) వలె 6-20 సాయం. సంగీతం (రి) 6-30 గ్రామసుల కార్యక్రమం మన సాహిత్యములో భూగోళ పరిజ్ఞానము. సప్తద్వీప ప్రశంస ప్రసంగం. మల్లంపల్లి సోమశేఖరశర్మ 7-0 తెలుగున వార్తలు 7-15 రాష్ట్ర పరిపాలనా విషయాలు మద్రాసు ప్రభుత్వ అభివృద్ధి ప్రణాళికపై ప్రసంగం 7-45 మద్రాసు (బి) వలె 9-30 ఎల్. గోపీనాథ్ 10-0 మద్రాసు (ఎ) వలె.

## విజయవాడ

ఉ. 7-0 తెలుగున వార్తలు 7-15 మధుర మణి అయ్యర్ రికార్డులు 7-30 గుంటుపల్లి రామమూర్తి నాదస్వరం 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 8-30 ఎం. ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ పాట 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1-0 తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా. 5-30 గుంటుపల్లి రామమూర్తి నాదస్వరం 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 గీతమంజరి ఎస్. వరలక్ష్మి రికార్డులు 6-30 గ్రామసుల కార్యక్రమం (మద్రాసునుండి) 7-0 తెలుగున వార్తలు 7-30 చదలవాడ సత్యనారాయణ 7-45 ఉస్తాద్ ఫయాజ్ ఖాన్ రికార్డులు 8.0 పరీక్ష నాటిక రచన హితశ్రీ 8-30 ఎం. ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ పాట 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 విశ్వవిద్యాలయాలకు నవీనరచనలో పోకడలు ఆంగ్ల ప్రసంగము. వి. గోపాలం 9-30 చిత్రవాణి రికార్డులు.

## హైద్రాబాదు

ఉ. 7-30 శ్రీమద్భగవద్గీత పండిట్ రామనివాసశర్మ. 7-45 కమలా దేవి. భజన్. 8-0 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 8-20 శ్రీమద్భగవద్గీత. తెలుగు వ్యాఖ్యతో కె. వి. ఎస్. శాస్త్రి. 8-30 జంత్ర సమ్మేళనం. 8-50 తెలుగున వార్తలు. 9.15 సిరాజ్ అహమ్మద్ ఖాన్. దాద్రాఘజల్ మ. 12-30 నగామే. రికార్డులు. 1-0 మారిబాబు రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). సా. 5-0 మహిళామండలి తెలుగున. ప్రాచీన భారతములో స్త్రీల ప్రతిపత్తి. వర్తకరంగములో ప్రాముఖ్యత. ప్రసంగం. వై. సీతాకుమారి, రుక్మిణీవరసింహన్. కర్నాటక సంగీతం. 'సుమస్తా గృహిణి' నాటిక రచన పి. నాగరాజు. 5-45 ఆరిఫ్ బసీర్. గీత్. 6-30 గ్రామసుల కార్యక్రమం. శాస్త్రీయ విజ్ఞానము. 'పక్షి జీవితము' డి. వి. జి కృష్ణమూర్తి ప్రసంగం. అష్టపదులు. యం. కృష్ణమూర్తి. రామకోటయ్య. 7-0 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 7-45 వృత్తిజీవితములో హాస్యము. 'వకీలు' తెలుగు ప్రసంగం. 7-55 ఆరిఫ్ బసీర్. 8-20 ఆరిఫ్ బసీర్ ఘజల్ గీత్. 8-40 కమలాదేవి. 8-50 సిరాజ్ అహమ్మద్ ఖాన్. దాద్రా. 9-0 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 9-15 'ప్రబంధోన్మాదము' నాటిక. రచన ఎస్. డి. దుర్గాచలం. 9-55 కమలాదేవి. దాద్రా గీత్. 10-10 సిరాజ్ అహమ్మద్ ఖాన్. దాద్రా. ఘజల్. 10-20 భజన్ రికార్డులు. 10-45. కమలాదేవి. ఘజల్ గీత్.

# సి.పి.,ఒరిస్సాల్లో ఉక్కు పరిశ్రమాలయాలు

## అధివేశ శాసనసభలో డా॥ ముఖర్జీగారి ప్రకటన

న్యూఢిల్లీ, డిశంబర్ 9: ఈవేళ అధివేశ పార్లమెంటులో ఆర్. కె. సిధ్వాగారు అడిగిన ప్రశ్నకు సమాధానం చెబుతూ పారిశ్రామిక మంత్రి శ్యామప్రసాద్ ముఖర్జీ, మధ్యపరగణాలలోనూ, ఒరిస్సాలోనూ నిర్మాణం చేయటానికి సంకల్పించిన రెండు ఉక్కు పరిశ్రమ కేంద్రాలకూ ఒక్కొక్కదానికి 90 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని ప్రభుత్వం అంచనా వేసుకున్నట్టు తెలియజేశారు. ప్రస్తుతమున్న ధనాభావపరిస్థితి కారణంగా ప్రభుత్వం యీ విషయాన్ని చాలా జాగ్రత్తగా యోజించుతున్నదనీ, రెండింటిలో దేన్ని ముందు ప్రారంభించాలి అనే సమస్యనైతే మధ్యపరగణాల కర్మాగారాన్నే ముందు ప్రారంభించటం జరుగుతుందనీ అన్నారు. ఈ ఫ్యాక్టరీ నిర్మాణం పూర్తిఅయితే సంవత్సరానికి గల క్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి అవుతుందన్నారు. ఈపరిశ్రమల స్థాపన విషయంలో సాంకేతిక విద్యానిపుణులనుంచి తగిన సలహాలు తీసుకునే నిమిత్తం, ప్రభుత్వం యిప్పటికి 4 లక్షల రూపాయలదాకా ఖర్చు చేసిందన్నారు.

## యుద్ధంలో మిగిలిన సరకుల అమ్మకం

యుద్ధానంతరం మిగిలివున్న సరకుల విక్రయాన్నిగురించి సిధ్వాగారు అడిగిన మరొక ప్రశ్నకు సమాధానం చెబుతూ ఈ వివరాలు తెలియజేశారు. "ఈ మిగులు సరకుల అమ్మకం 1951 మార్చితో ముగించివేసి ఆ ప్రభుత్వ శాఖను యెత్తివేస్తాం. ఈసరకులు ప్రభుత్వ వ్యవస్థలకు, వ్యక్తిగత పరిశ్రమలకు సక్రమ పద్ధతి పంపకం జరిగేలాగు చూడటానికి ప్రభుత్వం తగిన శ్రద్ధ తీసుకుంటున్నది. ఈనిల్వలలో కడచిన జనవరినుంచి అక్టోబర్ నెలాఖరువరకూ 10 కోట్ల రూపాయల సరుకు అమ్మకం జరిగింది. ఆసరకుల అసలుఖరీదు 24.85 కోట్లు. తొలి కొనుగోలు ఖరీదు 15 కోట్ల రూపాయిలని లెక్క వేయబడిన, బ్రిటిష్, ఇండియన్ నిల్వలు 7.95 కోట్లకు విక్రయించబడినవి. 9.97 కోట్ల రూపాయలకు లెక్క వేయబడిన అమెరికన్ గిడ్డంగుల నిల్వలు 1.2 కోట్ల రూపాయలకు అమ్మివేయబడినవి. 1944 నుంచి ఇంతవరకూ బ్రిటిష్ భారతదేశముల యుద్ధ నిల్వలు, తొలి కొనుగోలు ఖరీదుల ప్రకారం 171.67 కోట్ల రూపాయల సరుకువిక్రయించారు. అమెరికన్ సరుకు విలువ 240 కోట్లు, ఈ మొత్తం సరుకును 127.05 కోట్ల రూపాయలకు అమ్మటం జరిగింది. ఇంకా బ్రిటిష్, భారతదేశముల నిల్వలలో 76 కోట్ల రూపాయలు మిగిలి వున్నయ్. 25.32 కోట్లు అమెరికన్ సరుకు మిగిలివుంది. తాతా కంపెనీ ద్వారా విక్రయం కావటానికి మిగిలివున్న అమెరికన్ సరకులు మరో 41.85 కోట్లు.

## పారిశ్రామికోత్పత్తి

మరొక ప్రశ్నకు సమాధానంగా పారిశ్రామికమంత్రి పారిశ్రామికోత్పత్తులను గురించి ఇలా తెలియజేశారు.

"1949 సంవత్సరం, మొదటి మూడు పాదాలలోనూ, ఉక్కు, సిమెంటు, కాగితం, అట్టలు, డీసెల్ ఇంజన్లు, లాంతర్లు, కుట్టుమిషన్లూ వగైరా పరిశ్రమల ఉత్పత్తులు క్రమాభివృద్ధిలో వున్నయ్. వస్త్రాలు యంత్రపరికరాలూ, సైకిళ్ళు మందులు, రసాయనిక పదార్థాలు వగైరాలు ఉత్పత్తులు పతనగతిని సూచించుతున్నయ్. ఉత్పత్తులను పెంపుచేయటానికి ఆయా ప్రధానపరిశ్రమలలో ఉత్పత్తి ప్రోత్సాహక సంఘాలను యేర్పాటుచేయాలని కేంద్ర పారిశ్రామిక సలహామండలి సిఫారసుచేసింది. ఆ విధంగా చేయించుతున్నాం. 1950 లో జరుగవలసిన ఉత్పత్తులు నిర్ణయం చేస్తున్నాం అన్నారు.

## పెడరల్ కోర్టు

క్రొత్తగా భారత దేశంలో కలుస్తున్న సంస్థానాల అవ్వకేట్లకు ఎన్‌రోల్‌మెంటు చేసుకోటానికిగాను, తగిన నిబంధలను కల్పించుకో వలసిందిగా ఫెడరల్ కోర్టుకు విజ్ఞప్తి పంపామని డాక్టర్ అంబేద్కర్ ఈ వేళ పార్లమెంటు ప్రశ్నోత్తరసమయంలో వెల్లడించారు.

## దిగమతి ఎగుమతులు

"ఉల్లిపాయలు, మిర్చి పీటి మీద గల ఎగుమతి నిబంధనలను పాంతం యెత్తివేయలేదు. ఎగుమతి చేయటానికి అనుమతి వున్న గరిష్ఠావధివరకూ యెగుమతి దారులందరికీ స్వేచ్ఛగా అనుమతు లివ్వటానికి నిర్ణయించ బడ్డది. ఆ అవధి పూర్తికాగానే ఎగుమతులు నిలిపివేయబడతవి, అని నియోగి తెలియజేశారు.

పశ్చిమన్ అఖాతంలోవున్న షేక్ రాజ్యాలకూ, పాకిస్థాన్, ఆఫ్ఘనిస్థాన్ సింహళ దేశాలకూ భారతదేశం, 1947-48 లో 7614 టన్నుల పంచదారను యెగుమతి చేసింది. 1948-49 లో 15,169 టన్నులు ఎగుమతి చేసింది.

వాణిజ్యమంత్రి నియోగీ ఇలా తెలియజేశారు: మిల్లు యజమానుల స్వంతబాధ్యత మీద యెగుమతి అయ్యే వస్త్రాలమీద ప్రభుత్వం నిర్ణయించిన మిల్లురేట్లపైన నూటికి పదివంతుల చొప్పునా, ఇతరుల ద్వారా ఎగుమతి అయ్యే సరకులమీద నూటికి 8 వంతుల చొప్పునా అదనంగా వేసుకోవచ్చునని అనుమతి ఇచ్చాం. విదేశాలలో విడుదలయ్యే నమూనాలు వివిధగా తయారు చేయటానికి ప్రోత్సాహకరంగా వుంటుందని ఇలాటి సావకాశమిచ్చాం.

"అస్సాం రాష్ట్రానికి వస్త్రాలకొరత యేదీలేదు. రాష్ట్రప్రభుత్వం ఆవిషయాన్ని మాకు తెలియజేసింది. ఇంకా అదనంగా కావలసివుంటే పంపుతాం. సాధారణ వ్యాపారమార్గాలద్వారా కాకుండా తను నియామకం చేయించిన వ్యక్తులద్వారానే సరుకు సప్లయి చేయించవలసిందిగా రాష్ట్రప్రభుత్వం కోరివుండటంచేత నే అలా చేశాం, అని నియోగి అన్నారు.

## రాగి వుత్పత్తికేంద్రం

ముడిరాగిని శుద్ధిచేసే రాగి ఉత్పత్తి కేంద్రాన్ని స్థాపించటానికి ప్రభుత్వం తీవ్రంగా ఆలోచించుతున్నది. రాగి యీనాడు చాలా అత్యవసరమైన లోహంగా వున్నది. భారత దేశానికి యేటేటా షుమారు 60,000 టన్నులు కావలసి వుంటుంది.

## ఆ. భా. ఆర్థిక మహాసభకు 100 రూ. చందా

కాకినాడ, డిసెంబరు 8: తూర్పుగోదావరిజిల్లాబోర్డు నిన్న సమావేశమై వచ్చే నెల మొదటివారంలో మద్రాసులోజరుగనున్న అ. భా. ఆర్థికమహాసభకు ఖర్చుల నిమిత్తం రూ. 100 చందాయిచ్చినది.

## కృష్ణానది నీటిమట్టం

విజయవాడ, డిసెంబరు 10: కృష్ణానది నీటిమట్టం నేడు ఆనకట్టపై 6.4 అడుగులున్నది.

# సి. ఆర్. రెడ్డిగారి ప్రబోధం

(1 వ పేజీ తరువాయి)

రంగంలోనికే గాక, నవజీవిత రంగంలోనికే ప్రవేశిస్తున్నారు. కాలం మారినది. ఆంతరంగికంగానే కాక, బహిరంగంగా కూడ పరిస్థితులు ప్రమాద భరితంగా వున్నాయి. ప్రతి విప్లవంవలన ప్రాతకాలపు భావాలు, విలువలు మారి పోతాయి. ఇండియాలో కూడా విప్లవం జరిగింది. కాని ఈ విప్లవ మింకా పూర్తికాలేదు. ప్రాతభావాలు, ప్రాతవిలువలుమారిపోవాలి. అంతేకాదు. దేశీయుల స్వభావము, శీలము, ప్రవర్తన, అన్నీ కూడా దృఢతరం కావాలి. లేకపోతే అనుక్షణపరిణామం పొందుతున్న ఈ ప్రపంచపు పోటీలో మనదేశం నిలువలేదు.

అయితే ఇటువంటి పరిణామానికి అంతుచేటే భావాల మార్పు కు, ప్రవర్తన మార్పుకు రెండు విధాలైన అడ్డంకులున్నాయి. ప్రస్తుతావసరాలకి, భావి అవసరాలకి ఎట్టి మార్గాలననుసరించాలో తెలియకపోవటం ఒకటి. ప్రాతఅలవాట్లను వదులుకోలేకపోవటం రెండోది. బ్రిటిష్‌సామ్రాజ్య పరిపాలనక్రింద మనకొకటి అలవాటైంది భారతీయులను అధికారులుగాను, అనధికారులుగాను విభజించటం ఆరోజులకేతగింది. ఈ రోజుల్లో అధికార, అనధికార సంఘాలని వేర్వేరుగా పేర్కొనటం పనికిరాదు. దీనివల్ల అధికారులు విదేశ ప్రభుత్వాన్ని సేవిస్తున్నట్లు అనధికారులుమాత్రమే దేశభక్తులైనట్లు అపార్థం వస్తుంది. అనధికారుల్లోకూడా ఈ రోజులలో మతవర్గ రంగంలోను, కమ్యూనిస్టు రంగంలోను దేశద్రోహులు లేకపోలేదు.

ఇదేవిధంగా మనసేవలు, పోలీసులు విదేశ సామ్రాజ్య రక్షకభటులని భావించటం మానివేసి మన స్వదేశీయులుగానే వారిని గుర్తించి, వారిలో సంపూర్ణ విశ్వాసం ఉంచాలి. మన విద్యావంతులు, పైతరగతులవారు సైన్యంలో చేరటానికి కవిమక్షత చూపటానికి వీలులేదు. భారతసైన్యం ఇదివరకువలె భారతీయులను అణగద్రొక్కడానికిగాక రక్షించటానికే వున్నది. కనుక దేశభక్తియుతులైనవారందరూ సైన్యంలో చేరాలి. ఇదివరకు మనలో విద్యావంతులు ఉన్నతోద్యోగాలను ఆశించి బ్రిటిష్ ప్రభుత్వాన్ని సేవించారు. ఇప్పుడు భారతీయ ప్రభుత్వము రావడంతో ఇది సేవాధర్మంగా మారింది. బ్రిటిష్ ప్రభుత్వ దినాలలో సైన్యంలోను, ఉద్యోగాలలోను క్రమశిక్షణ, బ్రిటిషువారంటే వున్న భీతివల్లా, పెద్ద హోదాలపై ఆశవల్లా నిలబడేది. కాని ఇప్పుడు మన క్రమశిక్షణ దేశమంటే మనకుగల ప్రేమమీద, మనం బాధ్యతను విస్మరించి బలహీనులమైపోతే దేశమేమయిపోతుందోనని భయంమీద ఆధారపడివుండాలి. క్రమశిక్షణ అంటే నాయకుల తీర్పుకి క్రిందివారంతా లోబడివుండటమని అర్థం. ప్రజావసరాలను బట్టి మీరు నాయకులను మార్చుకోవచ్చును, కాని నాయకులక్కడ వున్నంతకాలం వారి ననుసరించటమే మన కర్తవ్యం. సైన్యానికి సేనాధిపతులెంత అవసరమో ప్రజాస్వామ్యానికి నాయకులంత అవసరం. స్వతంత్ర ప్రతిపత్తిగల మనం అనుసరించేది మన స్వంత ప్రభుత్వాన్నే కనుక మన ఆత్మగౌరవానికి కూడా ఏమీ భంగం వుండదు.

ప్రజానీకపు అభిప్రాయాలకంటె వారి నాయకుల అభిప్రాయములు ఉన్నతమైనవి. మంచివి కూడాను. అందుకనే మనసర్వసేనాని జనరల్ కరియప్ప దేశంలో క్రమశిక్షణ కావాలని ఉద్ఘాటిస్తున్నారు. బాగా విద్యాగంధులైన యువకులు సైన్యానికి అవసరమని ఆయన అంటున్నారు. అయితే క్రమశిక్షణ అంటే ఏమిటో అర్థంచేసుకుని, దానిని అనుసరించగలవారికే ఆయనకు కావాలి చీటికి మాటికీ సమ్మెలకు దిగే విద్యార్థులు ఆయన కక్కరలేదు.

తనంతట తాను క్రమశిక్షణ నవలంబించని సేనాని తనక్రింద సేనలలో క్రమశిక్షణను నెలకొల్పలేడు. క్రమరహితరక్షణ కేవలం మారణత్వం. ఎందుకంటే క్రమశిక్షణలేని సైన్యమును శత్రుసైన్యమెంత చిన్నదైనా అవలీలగా ఓడించగలదు.

ప్రస్తుతం రక్షణసైన్యం మనస్వంత సైన్యమే. అనగా మనసైనికులందరూ ప్రజలలోనుండివచ్చినవారే, ప్రజలు క్రమశిక్షణ ఎరుగని మూకలైతే, వారిలో నుంచివచ్చిన సైనికులలో మాత్రం క్రమశిక్షణ ఎలా వుంటుంది? కనుక ప్రస్తుతం క్రమశిక్షణ జాతికి ప్రధానావశ్యకత కనుకనే పరపరిపాలనలోకంటె ఇప్పుడే అవినీతి ఎక్కువ హానికరం.

ఇదికాక, మనసైన్యాలు కేవలం డబ్బుకోసం కక్కుర్తిపడేవి కావు గనుక, తాము సరియైన వాక్కుకోసం పోరాడుతున్నామనే నైతిక విశ్వాసంతుంటే నేలప్ప వారు బలిదానం చెయ్యటానికి సిద్ధపడరు. అవినీతిపూరితమైన ప్రభుత్వాలకోసం వారు త్యాగం చెయ్యబోరు. క్రమంగా వారు రాజకీయాల్లోకి ప్రవేశించి, విప్లవాన్ని కూడ లేవతీయగలరు.

మనకు అవకాశాలు లేనంతకాలమూ మన నైతికశీలం చెడలేదు, ఇప్పుడు అవకాశాలు రాగానే మనం మారిపోయాము.

నాయకుడు నేను. ప్రజాస్వామిక విధానమును మనం అవసరమైన దానికంటె ఎక్కువ అనుసరిస్తున్నామేమోనని అభిప్రాయపడుతున్నాను. అయినా ఈ ఘట్టం తాత్కాలిక మే కావచ్చు. నెహ్రూపటేల్ గార్ల అధ్వర్యాన నడుస్తున్న మన కేంద్ర ప్రభుత్వం దూరదృష్టితోను, దార్ఢ్యంతోను, వర్ణనాతీతా లెక్కలేని ఘనకార్యాలను చెయ్యగలిగింది. ముఖ్యంగా దేశాన్ని ఏకీకరించగలగడం అద్భుతమైన విజయం. అయితే సాంఘిక సుస్థిరత్వం ద్వారా బలపరచుకొంటేనేగాని ఈ విజయం నిలువలేదు. జాతులుగా, ఉపజాతులుగా, స్థానిక స్వార్థవాదాలతో విభక్తమైవున్న మనదేశం ఒకే ఒకభారతజాతిగా, ఒకే ఒక పౌరస్వత్వంగా పరిణామం చెందాలి. లేకపోతే శత్రువుల దుష్ప్రచారంవల్ల మనలో మనకే చీలికలు వచ్చి బలహీనులమై పోగలము. ఆటంబాంబుకు భౌతిక రంగంలో ఎంతవిధ్వంసకశక్తి వున్నదో, దుష్ప్రచారానికి నైతికరంగంలో అంతే విధ్వంసకశక్తివున్నది.

ఒకొక్కప్పుడు ప్రజాభిప్రాయం శాసనాలకంటె ముందుకు పురోగమిస్తుంది. ఒకొక్కప్పుడు శాసనాలే ప్రజాభిప్రాయాన్ని అధిగమిస్తాయి. కాని ఇండియాలో, ముఖ్యంగా హిందువులలో శాసనములు ప్రజాభిప్రాయాన్ని తోసుకొని ముందుకువెళ్ళాలి. కనుక ప్రజాభిప్రాయాన్ని శాసన వేగంతో సరిసమానం చేయటానికి పూనుకోవలసిన తక్షణబాధ్యత విద్యావంతులమీద వుంది.

## నూత్న రాజ్యాంగం

జాతీయంగాను, అంతర్జాతీయంగానూ చూస్తే, ఈ నవీనయుగంలో జరిగిన చరిత్రాత్మక సంఘటనలలో భారతదేశపు రాజ్యాంగం ఒకటి. ఇంతకంటె పెద్ద రాజ్యాంగం చరిత్రలో లేదు.

ఇదివరకటి ప్రకటనలకు, సైమనులకు విరుద్ధంగా అయినప్పటికీ మనదేశంలో అధికారమంతా కేంద్రీకృతం చేయబడింది. ఇది చాలా వివేకవంతమైన పని. యథార్థ పరిస్థితికి అనుకూలమైన వైఖరిని మననాయకులు అనుసరించారు. ప్రధాన సూత్రములనుమాత్రము నిబంధన చేసి మిగతా వాటిని ప్రజాభిప్రాయానుసారంగా మార్పుకో వచ్చునవటానికి మనదేశం ఇంగ్లండు, అమెరికాల అంతటి కేంద్రీకృతదేశం కాదు మన దేశంలో అనేకమతాలు, కులాలు, ఉపజాతులు ఉన్నాయి. మతవర్గ అపోహలు ఇంకా వదలిపోలేదు. ఎప్పుడైనా అవి పైకుబుకవచ్చు. అధికరణంలో హింసా, నిరంకుశత్వముల సహాయంతో ఒక క్రొత్త ప్రమాదం పైకి రావాలని చూస్తున్నది కమ్యూనిస్టులు, మతవర్గములుకూడా దేశంలోని పంచమాంగదళ సహాయంతో విజృంభింపజూస్తున్నారు. మనరిపబ్లిక్ లోని వివిధ భాగాల చరిత్ర, ఆర్థిక, రాజకీయ పరిణామం భిన్నభిన్నంగా వున్నాయి. ఇవి అన్నీ ఏకమై, ప్రజాభిప్రాయము, ప్రవర్తన ఒకటిగా రూపొందటానికి ఇంకా చాలకాలం పడుతుంది. రాష్ట్ర ప్రభుత్వాలు ఒక పార్టీకే చెందినవైనప్పటికీ, అవి ప్రవర్తించిన తీరు అంత ఆశాజనకంగాలేదు. మన పరిస్థితులు యుద్ధపరిస్థితులవలెనో, యుద్ధానంతర పరిస్థితులవలెనో ఉన్నాయి. కనుకనే బలీయమైన కేంద్రప్రభుత్వం మనకు అవసరమైంది. ముఖ్యంగా దేశరక్షణ, అందుకు కావలసిన సైనిక, శాస్త్రీయ, పారిశ్రామికావసరాలు కేంద్రప్రభుత్వ ఆర్థికబలాన్నంతనీ హరిస్తున్నవి. రాజ్యాంగపరిషత్తులో బలీయకేంద్రం కావాలని వాదించిన సభ్యులందరూ మద్రాసువారే కావడం ముదావహం.

బ్రిటిష్‌సామ్రాజ్య వాదంనుండి మనకు సంక్రమించిన ఇంకొక అలవాటేమిటంటే, అస్తమానం రాజకీయాలలో మునిగిపోవటం, బ్రిటిష్ పరిపాలనలో మనం వాటికి లొంగివుండటం తప్పమరేమీ చేయలేకపోతున్నాము కనుక స్వాతంత్ర్యం సంపాదించాలని, దేశాభ్యుదయ కార్యములను చేయాలని వాంఛతో పోరాడాము. అస్వాతంత్ర్యం వచ్చినతరవాతకూడా ఇంకా రాజకీయాలలో మునిగితేలటం తెలివితక్కువ. కనుక రాజకీయాలకు, ఎన్నికలకు ప్రాముఖ్యత నివ్వటం మానివేసి ఇతర నిర్మాణకార్యములకు మనశక్తిని వినియోగించాలి.

శాస్త్రవిజ్ఞానం లేనిదే ఏ నవీనదేశమూ అభివృద్ధి కాలేదు. మనకు పారిశ్రామికులు, ఇంజనీర్లు, ఉత్పత్తిదార్లు, పరిశోధకులు, మానవ కారుణ్యవాదులు, విద్యావేత్తలు, సాంస్కృతికరాయబారులు కావాలి.

ఇలాంటి సందర్భాలలో నూతన పట్టభద్రులు వీరులు, యోధులు, ధనివ్యక్తి నాయకులు కావాలని ప్రబోధించటం పరిపాటి. కాని నేను ఈ పరిపాటి ప్రబోధాలకులోడు, ప్రతిఒక్క పట్టభద్రుడు నిరాడంబరంగా, పెద్ద ఉద్యోగంలో ఉన్నా తక్కువ ఉద్యోగంలో ఉన్నా సేవాధర్మాన్ని నిర్వర్తించాలని, సుశిక్షితవ్యక్తులుగాను, పౌరులుగానూ తయారవ్వాలని ప్రబోధిస్తున్నాను. వ్యక్తిగత ప్రవర్తన ఆక్షేపణాతీతంగా వుండాలనీ, అప్పుడే దేశానికి సంఘానికి బలం, సుస్థిరత్వం చేకూరుతుందని, ఐకమత్యం, సౌమనస్యం అభివృద్ధి అవుతాయనికూడా నేను ప్రబోధిస్తున్నాను."

# ఫార్మోజాలో రక్షణ ఏర్పాట్లు

(1-వ పేజీ తరువాయి)

నిస్టులతో అప్పుడే రాజీబేరాలు చేస్తున్నాడని తెలుస్తున్నది.

జాతీయచైనా ఈరాష్ట్రాన్నించిగెరిల్లా యుద్ధంనడిపించాలనికూడా చూస్తున్నదట.

నిన్నరాత్రి కుమ్మింగ్ యుద్ధం ఏమి లేకుండా లొంగిపోవడాన్ని బట్టి మిగిలిన చోట్లకూడా ఇలాగే జరగవచ్చునని ఊహిస్తున్నారు. దీనివల్ల కమ్యూనిస్టు సైన్యాలు బర్మా, ఇండోచైనా సరిహద్దులకు సులభంగా, రాగలవని తెలుస్తున్నది

ఇక్కడినించి కమ్యూనిస్టు సైన్యాలు, బర్మా, ఇండోచైనా కమ్యూనిస్టులకు సన్నిహిత సంబంధం ఏర్పడగలదనికూడా విమర్శకులు భావిస్తున్నారు.

కాని చైనా కమ్యూనిస్టులు సరిహద్దులు దాటి అన్యదేశాలలోకి ప్రవేశిస్తారని ఎవరూ అనుకోవడంలేదు

# క్షణంలో కుమ్మింగ్ కమ్యూనిస్టుల కైవశం

హాంకాంగ్, డిసెంబరు 10 యునాన్ రాష్ట్రరాజధాని, కుమ్మింగ్ అకస్మాత్తుగా కమ్యూనిస్టుల వశమైపోయింది.

జాతీయ చైనా కాంటిరక్షక సైన్యాలు క్షణంలో చేతులు మార్చివేశాయని చైనా వార్తాపత్రికలు ప్రకటించాయి.

ఒక్కసారి ఆజ్ఞ ఇవ్వగానే విమానాశ్రయందగ్గర రక్షక సైన్యాలు క్షణంలో తమ టోపీలు మడిచివేసి, ధరించాయట! మడచి ధరించిన టోపీలపై చిహ్నాలైన అరుణతారలు కనిపించాయట!

కుమ్మింగ్ లో ఒక విమానం 45 మంది అమెరికనులతోను ఒక చైనీయునితోను హఠాత్తుగా తప్పించుకుని పారిపోయిందనీ తుపాకులు పేల్చినా దానికి తగలలేదనీ, ఒక విమానాధికారి చెప్పాడు.

కమ్యూనిస్టు సేనాని లీపోచెంగ్ సైన్యాలు చెంగ్టూను తీవ్రవేగంతో సమీపిస్తున్నాయనీ, చెంగ్టూఅంతా కల్లోలంగా ఉన్నదనీ తెలుస్తున్నది.

# చేతిపనులలో స్త్రీలకు శిక్షణ

## కేంద్ర విద్యాలయ స్థాపనకు ప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబరు 8: రాగల జనవరి నుంచి స్త్రీలకు చేతిపనులలో శిక్షణ ఇవ్వడానికి గాను కేంద్ర విద్యాలయం నడపడానికి నిర్ణయిస్తూ నేడు పరిశ్రమల, సప్లయిల శాఖ వారొక ప్రకటన చేశారు.

అఖిల భారత గృహపరిశ్రమల బోర్డు వారు చేసిన సూచనపై ఈ నిర్ణయం జరిగింది.

ఈ సంస్థలో శిక్షణ పొందిన స్త్రీలు వివిధ కేంద్ర, రాష్ట్ర, సంస్థానాలలోగల గృహపారిశ్రామిక శిక్షణ కేంద్రాలలో యువతులకు శిక్షణ ఇస్తారు.

మొదటి సంవత్సరం ఈ కేంద్ర విద్యాలయంలో 200 మంది స్త్రీలు చేర్చుకోబడతారు. వీరిలో 150 మందిని కేంద్ర, రాష్ట్ర, సంస్థాన ప్రభుత్వాల వారె ఎన్నుతారు. మిగిలిన 50 మంది నేరుగా దరఖాస్తులు పెట్టి చేరవచ్చు. వీరికి జీతా లుండవు. కొంతమందికి నెలకు రు 50ల వంతున విద్యార్థి వేతనంగూడా లభిస్తుంది. ఇది నేరుగా దరఖాస్తులు పెట్టిన వారిలో అర్హులకు లభిస్తుంది. విద్యార్థినులకు వసతి సౌకర్యాలుంటవి.

ప్రస్తుతంలో ఎనిమిది విద్యలలో మాత్రమే శిక్షణ లభిస్తుంది. శిక్షణ ఒక సంవత్సరం పాటు ఇవ్వబడుతుంది. ఈ అధ్యాపక శిక్షణ పొందేవారు ఇక్కడ శిక్షణ పొందే చేతివిద్యలలో ప్రాథమిక శిక్షణ పొందినవారై ఉండాలి. ఈ విధంగా ప్రాథమిక శిక్షణ పొందని వారికి ఒక సంవత్సరం పాటు ప్రాథమిక శిక్షణ ఇవ్వడానికి కూడా ఏర్పాట్లు జరిగినవి.

## రైలింజన్ల దిగుమతులు

న్యూఢిల్లీ, డిసెంబర్ 8: గిరాకీ ద్రవ్య ప్రాంతాల నుంచి 202 బ్రాడ్ గేజ్ ఇంజన్లూ, సులభద్రవ్య ప్రాంతాల నుంచి 44 మీటర్ గేజ్ ఇంజన్లూ 1949 ఏప్రిల్ నుంచి సెప్టెంబర్ వరకూ దిగుమతి చేయబడినవని రైల్వేమంత్రి గోపాలస్వామి అయ్యంగార్ నేడు పార్లమెంటులో ఒక ప్రశ్నకు జవాబిస్తూ తెలియజేశాడు.

1950 మార్చిలోపుగా, గిరాకీ ద్రవ్య ప్రాంతాల నుంచి 138 బ్రాడ్ గేజ్ ఇంజన్లూ 170 మీటర్ గేజ్ ఇంజన్లూ, సులభ ద్రవ్య ప్రాంతాలనుంచి 52 బ్రాడ్ గేజ్ ఇంజన్లూ రాగలవని ఆయన వెల్లడించాడు. కెనడా నుంచి వచ్చిన ఇంజన్లు సంతృప్తికరంగానే పని చేస్తున్నవని ఆయన అన్నాడు.

మనదేశంలో, చిత్తరంజన్ వర్కుషాపులో తయారయే మొదటి ఇంజన్ 1951 ఫిబ్రవరి, మార్చి ప్రాంతంలో పూర్తవుతుందని ఆయన తెలియజేశాడు.

### కొత్త రైళ్లు

ఈ ఏడాది 127 కొత్తరైళ్లను ప్రారంభించామనీ, 88 రైళ్లను విస్తరింప చేశామనీ ఆయన మరొక ప్రశ్నకు సమాధానమిస్తూ వెల్లడించాడు.

### ప్రమాదాలు

"1948-49 సంIIలో ప్రయాణీకుల రైళ్ళకు 18 పెద్ద ప్రమాదాలు జరగ్గా ఈ సంII 6 ప్రమాదాలు మాత్రమే జరిగినవి. ఈ ఆరింట్లోనూ నాలుగు ప్రమాదాలు కొందరు చేయాలని పట్టాలు తొలగించటం వల్లనూ, ఒకటి రైల్వే సిబ్బంది పొరపాటువల్లనూ జరిగినవి. 6వ దాని కారణం తెలియలేదు. ప్రమదాలవల్ల 15 గురు మరణించటం, 2,55,000 రూపాయలు రైల్వేసరుకు నష్టంరావటం జరిగింది.

### ఇండో - పాకిస్థాన్ రవాణా

హార్డిబర్ - సిలిగురి రైలుమార్గంమీద ద్రవ్యమారకపురేటు తగ్గింపుకుతరువాత వసూలుచేసిన సర్ చార్జీలను వాపసుచేయమని పాకిస్థాన్ ప్రభుత్వాన్ని కోరి ఉన్నాము.

### పంజాబ్ నీటిపంపకం

తూర్పు పంజాబుకు చెందిన కాలవల నీటిని వాడుకున్నందుకు పశ్చిమపంజాబ్ ప్రభుత్వం తూర్పుపంజాబ్ ప్రభుత్వానికి 1949 సెప్టెంబర్లోపుగా 70,08,775 రూపాయలను చెల్లించింది. దానివిషయమై తగాదా పరిష్కారమయేవరకూ పశ్చిమ పంజాబ్ ఇండియా రిజర్వ్ బ్యాంకులో 21,25,207 రూపాయలను హామీగా ఉంచింది," అని ఆయనవెల్లడించాడు.

## ధరలతగ్గింపు

"దేశంలో ఆహారపదార్థాల ధరలు 100కి 7 నుంచి 8 వంతుల వరకూ తగ్గించబడినవి. నుడ్డల ధరల తగ్గింపు ఇదివరకే ప్రకటించబడినది. పిగ్ ఐయర్న్ (ముడి ఇనుము) విలువ 100కి 7 వంతులు తగ్గించబడ్డది. అదే విధముగా ఉక్కు ధరలను కూడా తగ్గించే ఆలోచన ఉన్నది. సిమెంటు ధరలను తగ్గించ వీలులేక పోయింది. బొగ్గు ధరలను 100కి 4 వంతులు తగ్గించటమే కాక సిమెంట్ కాగితం, నేతపరిశ్రమలకు ఉపయోగించే బొగ్గురవాణా ఖర్చులలో రూపాయికి పావు తగ్గించబడ్డది." అని ఆర్థిక మంత్రి డాII మత్తయ్ నేడు పార్లమెంటులో ప్రకటించాడు.

### అమెరికన్ ట్రాక్టర్లు

ప్రపంచ బ్యాంకు మనకిచ్చిన కోటి డాలర్ల అప్పులోనంచి 375 ట్రాక్టర్లు తెప్పించబడినవి. 180 ట్రాక్టర్లకి ఆర్డర్లు ఇవ్వటం జరిగింది. అవి ఫిబ్రవరినాటికి దేశంలో దిగుతవి. మిగిలినవి అక్టోబర్ లోపుగా రాగలవు." అని ఆహార మంత్రి జైరాందాస్ ఒక ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించాడు.

# ఐక్యరాజ్య సమితి చతుర్థవార్షిక సభలో భారతదేశ ప్రధానపాత్ర

## సర్. బెనెగల్ నరసింగరావుగారి సమీక్ష

ఫ్లషింగ్ మెడోస్, డిసెంబరు 9: "జనరల్ అసెంబ్లీ చతుర్థ సమావేశంలో తానింతవరకు సాధించిన కార్యకలాపాలను చూచుకొని భారత దేశంమనస్ఫూర్తిగా సంతుష్టి చెందవచ్చును." అని ఈ వేళ భారత ప్రతినిధివర్గ నాయకుడైన సర్ బెనెగల్ నరసింగరావుగారు సమితిలో తానువహించిన పాత్రనుసమీక్షిస్తూ చెప్పిరి.

ఇండియా భద్రతామండలికి నూటికి 99 వంతుల మెజారిటీతో ఎన్నుకోబడ్డదన్నమాట అటుంచి, అసెంబ్లీకి చెందిన వివిధకమిటీలలోను ప్రధానంగా ఇటలీవలస సమస్యమీదను పరపాలిత ప్రాంతాల విషయంలోను భారతప్రతినిధివర్గం చాలా ప్రముఖపాత్ర వహించింది.

"ఐక్యరాజ్య సమితిలో భారతదేశం అంతకంతకు ప్రధానమైనపాత్రను వహిస్తున్నది. ఇదివరకే అనేకసంఘాలలో భారతదేశానికి ప్రాతినిధ్యంఏర్పడిఉన్నది. ఈ సమావేశంలో ఇంకో 8 సంఘాలలో కొత్తగా ప్రాతినిధ్యంలభించింది. ఈ మూడింటిలోకి భద్రతామండలి సభ్యత్వమే ప్రధానమైనదని వేరుగా చెప్పనక్కరలేదు. ఇండియాకు ప్రతికూలంగా ఒకవైపునుంచి తీవ్రప్రచారం జరిగింది అయినాఅపూర్వమైన సంఖ్యాబలంతో ఇండియా భద్రతామండలికి ఎన్నుకొనబడింది. పోతే, పరపాలిత రాజ్యాలనుగురించి పాలక రాజ్యాలు పంపే సమాచారాన్ని పరిశీలిస్తూ ఉండడానికి ఒకప్రత్యేక సంఘం నియమించబడినది; ఈ సంఘంలో కూడా భారతదేశానికి 3 ఏళ్లపాటు సభ్యత్వం లభించింది; 1 సంవత్సరం మొదలుకొని 3 సంవత్సరాలవరకు రకరకాల సభ్యత్వాలు ఉన్నా, భారతదేశానికి పైన చెప్పినట్లు శ్వేచ్ఛ తరగతి సభ్యత్వమే లభించింది. అదిగాక, సమితి కార్యాలయ నిర్వహణ సంఘంలో నవనగర్ జాంసాహెబ్ గారు సభ్యులుగా ఎన్నుకొనబడిరి.

జాంసాహెబ్ గారు వివిధ దేశాల ప్రతినిధుల ఆదరాన్ని చూరగొన్నారు. ఆయన బడ్జెట్ కమిటీలో సమితి నిర్వహణ వ్యయాన్ని తగ్గించవలెనని వాదించి సఫలుడైనాడు. ఈ తగ్గింపు మూలంగా ఇండియా వంతుకు 2 లక్షల 87 వేల డాలర్ల ఖర్చు తగ్గుతుంది.

ఏ వర్గంలోనూ చేరకుండా ప్రతి విషయంలోను స్వతంత్ర విధానాన్ని అవలంబించాలని భారతదేశం చేసుకున్న నిర్ణయం చాలా ప్రశస్తమైన ఫలితాలను ఇస్తున్నది. ఈవిధమైన వైఖరి అవలంబించడంవల్ల ఎవరితోను విరోధం తెచ్చుకోకుండా అందరికీని అంగీకారయోగ్యమైన ప్రతిపాదనలను చేయడానికి అవకాశం చిక్కుతున్నది. ఇటలీ వలస రాజ్యాలమీద ఇండియా చేసిన ప్రతిపాదనలను దీనికి దృష్టాంతంగా పేర్కొనవచ్చును. లిబియాకు తక్షణమే స్వాతంత్ర్యం ఇవ్వాలని రష్యా, 3 ఏళ్ల అనంతరం సమితిప్రమేయం లేకుండా బ్రిటన్ ఫ్రాన్సులే స్వయంగా అధికారదత్తత చేయాలని అమెరికా మొదట్లో ప్రతిపాదనలు చేసినవి. కాని వీరిలో ఎవ్వరికీ ఒకరి ప్రతిపాదన ఒకరికి నచ్చలేదు. రష్యా ప్రతిపాదన ప్రకారం చేస్తే నడమంతరపు ఏర్పాట్లు జరపడానికికూడా వ్యవధి ఉండదు. అమెరికా ప్రతిపాదనప్రకారం చేస్తే, దేశవాసుల అభీష్టాన్ని నిర్లక్ష్యం చేసి బ్రిటన్ ఫ్రాన్సులు తమకు ఇష్టమైనవిధంగా అధికారప్రదానపు ఏర్పాట్లు చేయడానికి వీలు అవుతుంది.

అందుచేత ఈ లోపాలు ఏవీ రాకుండా, సమితి ఆధ్వర్యమునసే నడమంతరపు ఏర్పాట్లు చేయాలని భారతదేశం ఒక రాజీ ప్రతిపాదన చేసింది. చివరకు జనరల్ అసెంబ్లీలో భారతదేశ ప్రతిపాదనకే విజయం లభించింది. ఇలాగే సోమాలీలాండ్ విషయంలోకూడా భారత ప్రతినిధివర్గం ప్రతిపాదించిన రాజ్యాంగమే చివరకు స్వీకరించబడినది."

అమెరికా బ్రిటన్లకూ రష్యాకూ శాంతి పరతుల నిర్వహణం విషయమై వచ్చిన వివాదంలోకూడా భారతదేశం ఇలాగే మధ్యమార్గం అవలంబించింది. అమెరికా బ్రిటన్లు దురాక్రమణకు సన్నాహాలు చేస్తున్నవని ఆరోపిస్తూ రష్యా ప్రతిపాదించిన తీర్మానాన్ని భారతదేశం ప్రతిఘటించింది కాని యుద్ధ హేతువులేవో శాంతంగా విడమర్చి చూడవలసిన ఆవశ్యకతను సభ్యులచేత భారత ప్రతినిధివర్గం గమనింపజేసింది. భారతదేశం చెప్పిన అలోచనమీదనే పరపాలిత కార్యాలను గురించి భోగట్టా చేయడానికి ఒక సంఘం నియమించబడినది. నైరృతి ఆఫ్రికాకు సంబంధించిన కొన్ని అంశాలను అంతర్జాతీయ న్యాయస్థానానికి నివేదించవలెనన్న నిర్ణయంకూడా భారతదేశం సలహామీద చేసిందే. ఇండోనేషియా సమస్య పరిష్కారం అవడం ముదావహం. అణుశక్తి కంట్రోలు విషయమై అంతర్జాతీయ న్యాయసంఘంచేత ప్రతిపాదనలు తయారు చేయించాలని భారత ప్రతినిధివర్గం ఒక సూచన చేసింది; కాని ఈ సూచన స్వీకరించబడలేదు. ఈ ప్రతిపాదన ప్రస్తుతానికి నెగ్గకపోయినా ఉత్తరోత్తరా ఫలించడానికి సావకాశం లేకపోలేదు"

కెనడా మొదలైన రాజ్యాలు సర్ బి. ఎన్. రావుగారిని అణుశక్తి కంట్రోలు విషయమై వారి అభిప్రాయాలను తెలిపి నిర్వచించవలసిందని లోపాయికారిగా కోరినట్లు తెలుస్తున్నది. అగ్రరాజ్యాలు అణుశక్తి కంట్రోలు విషయమై లేక్ సక్సెస్లో వచ్చేవారం మళ్లీ సంప్రతింపులు సాగిస్తవి.

# చైనా సేనలు బర్మా సరిహద్దు దాటివస్తే—

## నిరాయుధం చేస్తామని అధికార ప్రకటన

రంగూన్, డిసెంబర్ 10: చైనా జాతీయప్రభుత్వ సేనలుగాని, కమ్యూనిస్టులుగాని తమ దేశంలో ప్రవేశించినట్లయితే వారిని నిరాయుధం చేయడమవుతుందని బర్మా ప్రభుత్వం నేడు ఒక ప్రకటన చేసింది. చైనా అంతర్యుద్ధంలో బర్మా నిష్పక్షపాతంగా తటస్థభావాన్నే అనుసరించి దనికూడా ఇది ప్రకటనలో వున్నది.

## వీటాం సరిహద్దు పట్టణం కమ్యూనిస్టుల కైవసం

సైగాన్, డిసెంబరు 9: ఒక్కతుపాకి పేల్చకుండా ఇండోచైనా సరిహద్దు నానుకునిఉన్న టాంఘింగ్ పట్టణాన్ని చైనా కమ్యూనిస్టు గెరిల్లాలు ఆక్రమించుకున్నారని తెలుస్తున్నది. టాంఘింగ్ ఇండోచైనాలోని మొంకే పట్టణానికి ఎదురుగాఉన్నది. ఈ వార్తకు ఫ్రెంచిఅధికారులేమీ కలవరపడలేదు.

కమ్యూనిస్టు గెరిల్లాలు, పట్టణంలోని కొమింటాంగ్ సైనికులతో సంప్రదింపులు జరిపి శాంతియుతంగా పట్టణాన్ని వశపరచుకున్నారు.

క్వాంగ్సీ రాష్ట్రంలో పోరాడుతున్న కొమింటాంగ్ సేనాని పాయ్ చంగ్సీ తన సేనలను హైనాన్ ద్వీపంలోకి ఉపసంహరించుకొన నిశ్చయించటంవల్ల ఇండోచైనాపై కొమింటాంగ్ సేనలు దాడిచేసే ప్రమాదం తొలగిపోయినట్లు భావించబడుతున్నది. పాయ్ చంగ్సీ సేనలు ఒక క్రమం లేకుండా గగ్గోలుగా హైనాన్కి పోతున్నవనీ, వాళ్ల పడవలు కొన్ని ఇండోచైనా ప్రాంతీయ సముద్రంలోకి వచ్చినప్పుడు ఫ్రెంచి అధికారులు నిర్బంధించారనీ తెలుస్తున్నది.

## పాకిస్థాన్లోని చైనా సేనానుల ప్రయాణం: ఇండియా అనుమతులు

న్యూఢిల్లీ, డిసెంబరు 10: హిమాలయాల ద్వారా పాకిస్థాన్లోకి పారిపోయివచ్చిన చైనా జాతీయ ప్రభుత్వ సేనానాయకులు ఆరుగురికీ, ఇతర చైనా జాతీయవాదులకూ, భారతదేశంమీదుగా ప్రయాణంచేయటానికి అనుమతుల నివ్వవచ్చునని భారతప్రభుత్వం పాకిస్థాన్లోని హైకమిషనరుకు తెలియజేసింది. ఇందువల్ల వారు హాంగ్ కాంగుకుగాని, ఫార్మోజాకుగాని చేరటానికి అవకాశంకలుగుతుంది.

ఈవిశాఖ రాజీయ సభ 44 వ సమావేశము ఫిబ్రవరిలో మదరాసులో జరుగును.

# "ఏడాదిలో ఎంతైనా చేయవచ్చు"

## మద్రాస్ మేయర్ పదవి: పుల్లారెడ్డిగారి అభిప్రాయం

మదరాసు, డిసెంబరు 9: "ఏడాదిలోనే మేయరుగారు నగరానికి ఎంతో మేలుచేయవచ్చు. సత్యమూర్తిగారి విషయంలో ఆ విషయం రుజువయింది. డాII చెరియనుగారుకూడ సత్యమూర్తివలె కీర్తి గడించగలరని నమ్ముచున్నాను. మేయరు సహాయంలేనిది కమిషనరు ఏమీ చేయలేడనికూడ నా అనుభవంబట్టి నే చెప్పగలను." అని ఒ. పుల్లారెడ్డి ఐ. సి. యస్. గారు మాజీ కమిషనరు హోముకార్యదర్శి నిన్న సాయంకాలం వై. ఎం. ఐ. ఏ. సభయందు మేయరు డాII చెరియను గారిని అభినందించుచు నుడివిరి. కె. సంజీవకామతుగారు అతిథులకు స్వాగతమొసంగి డాII చెరియనుగారిని అభినందించిరి.

## మేయరు తుపాను సహాయ సంఘం

మదరాసు, డిసెం 10: మేయరు డాII పి. వి. చెరియనుగారు, ఆంధ్రదేశ తుపాను సహాయంగూర్చి చర్చింప పురపెద్దల సభను నేడుదయం, 10 గం.లకు రిప్పను భవనము లందేర్పాటుచేసిరి. ఆర్థికశాఖ డిప్టి కార్యదర్శి వి. కె. రావుగారు, కమీషనరు నరశింహం, కౌన్సిలరులు డాII వి. కె. జాను మున్నగు పెద్దలు పలువురు వచ్చిరి. మేయరు సభాపదరముగూర్చి తెలిపిరి. ఇంతవరకు ఒకలక్షత్రయమువద్ద వసూలయినదని చెప్పిరి. ఫిల్ము పరిశ్రామికులు రూ 35,000 బిన్నీకంపెనీ 10,000 కార్పొరేషను రూ 5000, సర్ సి. పి. గారు రూ 500 యిచ్చిరని తెలిపిరి. జండాదినమొకటి జరిపి వసూలుచేయాలని కె. ఎస్. రామస్వామి శాస్త్రి సూచించిరి. కార్పొరేషను రెవిన్యూశాఖవారిచేతను, విద్యార్థులచేత గూడవసూళ్ళు చేయించాలని హామీదుఖాను, ఆర్. సుబ్బయ్యనాయుడుగార్లు ప్రజలంతా యీ సహాయకార్యములందు తోడ్పడవలెనని మేయరు కోరిరి.

### ఆంధ్రతుపాను బాధితుల సహాయార్థం నాటకప్రదర్శనం

చెన్నపట్నం, డిశంబర్ 10: ఆంధ్ర శ్రేయోభివృద్ధి సంఘంవారు జమాన్యమున యేర్పడిన ఆంధ్ర తుపాను బాధితుల సహాయ సహాయనిధికి విశాల మిచ్చుట కుగాను గాంధి నాట్యమండలివారు నామ నాటకమును తెలుగులో డిశం 17 తే సా 5-30 గం. సెంటు మేరీస్ హాలులో ప్రదర్శింపనున్నారు.

మదరాసు పౌరులు యీ నాటకమునకు అసంఖ్యాకముగా హాజరై తుపాను బాధితుల నిధికి ఎక్కువడబ్బు ప్రోగుచేయుటకు తోడ్పడవలెనని నిధి ఉపాధ్యక్షుడు శ్రీ సి. వి. హనుమంతరావుగారు విన్నవించుచున్నారు.

## డిటెన్యూల విడుదల

మదరాసు, డిశంబరు 9: కమ్యూనిస్టు పార్టీ వ్యవహారములలోనూ, రహస్య చర్యలలోనూ పాల్గొనమని పూచీ ఇచ్చినందున కృష్ణాజిల్లా కమ్యూనిస్టులు కల్యాణం పిచ్చయ్య, కల్యాణం వీరభద్రయ్యలను విడుదలచేయవలెనని ప్రభుత్వం ఉత్తర్వు చేసెను.

విశాఖపట్నంజిల్లా కమ్యూనిస్టు శ్రీ కామరాజు లక్ష్మీపతిగారిపై గల 1949 ఆగష్టు 2వ తేదీ బహిష్కరణ ఉత్తర్వును కూడ ప్రభుత్వము రద్దుచేసెను.

## ప్రభుత్వోద్యోగులపై అవినీతి నేరములు

మదరాసు, డిసెంబరు 9:— జూలై నెలలో 290 ప్రభుత్వోద్యోగులపై అవినీతి నేరములు మోపబడెను. నేరము రుజువు కానందున ఇద్దర్ని విడుదల చేసిరి. సెలాఖరుకు 278 మందిపై కేసులు అమలునందున్నవి. మిగిలిన 10 మంది తగురీతిగా శిక్షింపబడిరి. ఇందులో 7 రు కఠినముగా దఠినముగా శిక్షింపబడిరని ప్రభుత్వము ప్రకటించుచున్నది. కఠిన శిక్ష విధించబడినవారి వివరములు:—

ట్రిబ్యునల్ విచారించిన కేసులు:— గెజెటెడ్ ఆఫీసర్లు: తిరుచినాపల్లి సెంట్రలు రిఫార్మ్సు స్కూల్ ప్రిన్సిపాల్ జె. డబ్ల్యు. డగ్గన్ను బర్తరఫు చేసిరి.

నాన్ గెజెటెడ్ ఆఫీసర్లు:—గవర్నమెంటు సింకోనా తోటల అఫ్సర్ డివిజన్ క్లర్కు ఆర్. వెంకట్రామన్ను బర్తరఫు చేసిరి.

డిపార్టుమెంటు అధికార్లు విచారించిన కేసులు:— టెంకసీ నర్సింగ్ ఆగస్టీ హాస్పిటల్ రత్నంను ఉద్యోగమునుండి తీసివేసిరి. కానిస్టేబుల్ పాపయ్య, సిటీ రేషనింగ్ గుమాస్తా ఎ. యం. శేషగిరి, సిటీ రేషనింగ్ ఎన్క్వయిరీ ఆఫీసరు పి. నటరాజన్లను బర్తరఫు చేసిరి.

లాకాలేజి ప్రిన్సిపాలు కె. కృష్ణమీనన్ గారికి విద్యార్థులు వీడ్కోలు విందొసంగిరి.

# జరూసలెం నగరంపై అంతర్జాతీయ పరిపాలన

## ఏర్పడాలని ఐక్యరాజ్యసమితి నిర్ణయం

ఫ్లషింగ్ మెడోస్, డిసెంబరు 9: జరూసలెం నగరాన్ని, శాశ్వతంగా అంతర్జాతీయ పరిపాలనాధిపత్యం క్రింద ఉంచుటకు ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం యీ రాత్రి తీర్మానించింది. ధర్మకర్తృత్వ సంఘం నిర్దేశించే అధిపత్యం క్రింద నగరంపై యీ అంతర్జాతీయ పరిపాలన సాగవలెననికూడా ఐక్యరాజ్యసమితి తీర్మానించింది. ప్రస్తుత పురపాలకసంఘ పరిపాలన క్రిందనున్న ప్రాంతము, పరిసర గ్రామాలు కలసి జరూసలెం నగరము అని సమితి నిర్వచించింది.

తీర్మానంలో పేర్కొన్న సూత్రములను పొందుపరచి, ఒక పరిపాలనా చట్టాన్ని యీసారి సమావేశంలో తయారు చేయాలని, యీ చట్టాన్ని అమలు జరుపుటలో అడ్డుతగిలే ప్రభుత్వాలను ప్రతిఘటించాలని ధర్మకర్తృత్వసంఘాన్ని సమితి ఆదేశించింది.

ఈ తీర్మానమునకు అనుకూలంగా 38 ఓట్లు, ప్రతికూలంగా 14 ఓట్లు వచ్చినవి. ఆరుగురు ఓటింగ్‌లో పాల్గొనలేదు.

### బ్రిటిష్ వైఖరి

అరబ్బులకు యూదులకుగూడా, అంగీకారంగాలేని యే చర్యలను, తాము జరూసలెంలో అమలు జరుపబోమని బ్రిటన్ ఐక్యరాజ్యసమితికి నేడు ఖచ్చితంగా చెప్పింది.

పాలస్తీనా విషయంలో 1937 లో యేవైఖరి అవలంబించిందో, ఆ వైఖరినే యిప్పటికీ బ్రిటన్ అనుసరిస్తున్నది.

జరూసలెం నగరంతో ప్రత్యక్షసంబంధమున్న ఇస్రాయిల్, జోర్డన్‌లు, జరూసలెం నగరంపై అంతర్జాతీయ పరిపాలనకు ఒప్పుకోమని చెప్పినవి. అరబ్బులకు యూదులకు సమ్మతంకాని పరిష్కారాన్ని అమలుజరుపబోమని, బ్రిటిష్ ప్రతినిధి చెప్పాడు.

ఈ తీర్మానాన్ని ఆమోదించడం వల్ల ఐక్యరాజ్యసమితి పరువు ప్రతిష్టలు ఇనుమడిస్తాయేమో ఒకపరి పునరాలోచించవలసిందని సమితి సభ్యులకు బ్రిటిష్ ప్రతినిధి అలెగ్జాండర్ కాడగన్ కోరారు.

స్వీడిష్ ప్రతినిధి మాట్లాడుతూ, జరూసలెంపై అంతర్జాతీయ పరిపాలన ఏర్పాటు చేయడం, ఐక్యరాజ్యసమితి అనవసరమైన బరువు తలపై వేసుకోవడమని అన్నాడు.

నెదర్లాండ్ ప్రతినిధి మాట్లాడుతూ, సమితి తీర్మానం 'కాగితంమీదనే' ఉంటుందిగాని అమలుజరిగే సావకాశంలేదని, అరబ్బులు, యూదులు యీ తీర్మానాన్ని అంగీకరించలేదనే విషయం విస్మరించడం వాస్తవాన్ని గుర్తించకుండా కళ్లు మూసుకోవడమేనని అన్నాడు. ఈ తీర్మానం ఆమోదిస్తే నగరంలో పుణ్యక్షేత్రాలకు రక్షణ ఉండదని కెనడా ప్రతినిధి అన్నాడు.

తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు చేస్తామని అమెరికా ప్రతినిధి ప్రకటించాడు. వైఖరి ప్రదర్శించడం, ఐక్యరాజ్య సమితి మరణదండన విధించడంవలె ఉన్నది. అని ఈజిప్టు ప్రతినిధి విమర్శించాడు.

తీర్మానాన్ని అమలుజరుపుటకు తీసుకునేచర్యలు ప్రమాదకర పరిస్థితులకు దారితీయవచ్చునని ద. ఆఫ్రికా ప్రతినిధి అన్నాడు. ఆస్ట్రేలియా ప్రతినిధి తీర్మానాన్ని సమర్థించాడు.

అంతవరకూ జరూసలెం అంతర్జాతీయ పరిపాలన పథకాన్ని సమర్థించిన ఈజిప్టు ప్రతినిధి మాట్లాడుతూ, నగరాన్ని ఇస్రాయిల్ సైనిక శిబిరంగా మార్చిందని, సమితి నిర్ణయాన్ని యిదివరలోవలె తృణీకరించుటకు సంసిద్ధంగా వున్నదని కాబట్టి జరూసలెంపై అంతర్జాతీయ పరిపాలనను అమలు జరుపలేకపోతే సమితి పేరుప్రతిష్టలకు అంతకంటే తీవ్ర అఘాతం మరేమీలేదని, అన్నాడు.

బ్రిటన్, అమెరికాలు తీర్మానాన్ని ప్రతిఘటిస్తూ డెన్మార్కు తీర్మానానికి వ్యతిరేకంగా ఓటుచేసింది.

జరూసలెంపై అంతర్జాతీయ పరిపాలన నెలకొల్పుటకు సమితి 1947 పాలస్తీనా విభజన తీర్మానంలోనే నిరయించింది. ఆ వాగ్దానమును నెరవేర్చుటకు చర్య గైకొనకపోతే సమితి సంఘ ప్రతిష్టలు తీవ్రంగా దెబ్బతినగలవు. కనుక నగరంపై అంతర్జాతీయ పరిపాలన నెలకొల్పే తీర్మానాన్ని పాకిస్థాన్ బలపరుస్తుందని అని పాకిస్థాన్ ప్రతినిధి జఫ్రుల్లా ఖాన్ ప్రకటించాడు.

### శరత్‌బోస్ హర్షం

కలకత్తా, డిసెంబరు 9: భాషారాష్ట్రముల నిర్మాణంవిషయంలో కాంగ్రెసు చేస్తున్న జాగుపట్ల అసమ్మతి సూచకంగా కర్ణాటకుల నానాసత్యాగ్రహమునకు, శరత్ బోస్ హర్షాన్ని వెలిబుచ్చుతూ అభినందన సందేశం పంపాడు.

## కాందిశీకుల చేతి పరిశ్రమల ప్రదర్శనం

### గవర్నర్‌జనరల్ సందర్శనం

న్యూఢిల్లీ, డిసెంబర్ 9: కాందిశీక మంత్రి వర్గంలోని మహిళా శాఖవారు యేర్పాటు చేసిన చేతి పరిశ్రమల ప్రదర్శనాన్ని గవర్నర్ జనరల్ సి. రాజగోపాలాచారి గారు ఈ వేళ సందర్శించారు. ఈ ప్రదర్శనంలో అనేక రకాల కుట్టు పనులు అల్లిక సామానులూ ప్రదర్శించారు. 12 ప్రత్యేక శిక్షణ కేంద్రాలు స్థాపించి కాందిశీక స్త్రీలకు వివిధ రకాల చేతిపనులు నేర్పి వారంతట వారు జీవించగల సావకాశాన్ని కలుగజేస్తున్నారు. ఈ కేంద్రాలలో 3000 మంది స్త్రీలకు పైగా శిక్షణ పొందుతున్నారు.

మహిళాశాఖడైరెక్టరు జాన్‌మత్తయ్ వీరు తయారు చేస్తున్న అల్లిక సామానులు వస్తే రాబోవు విదేశాలలో చాలా గిరాకీ వస్తున్నదన్నారు.

## కాందిశీకుల తరపున యే సూచన వచ్చినా ప్రభుత్వం జాగ్రత్తగా ఆలోచిస్తుంది

### ప్రధాని నెహ్రూ హామీ

న్యూఢిల్లీ, డిసెంబరు 9;—కాందిశీకుల ఆస్తివ్యవహారాల విషయంలో, అఖిల భారత కాందిశీక మహాసభనుంచి యే సూచన వచ్చినా ప్రభుత్వం చాలా శ్రద్ధగా దాన్ని ఆలోచించగలదని హామీ యిస్తూ ప్రధాని నెహ్రూ, కాందిశీక మహాసభ అధ్యక్షులు డాక్టర్ చొత్‌రామ్ గిద్వానీ గారికి ఒక లేఖ వ్రాశారు.

"మేము కాందిశీక శాసన విషయంలో చాలా శ్రద్ధగా ఆలోచించాం. అంతర్జాతీయంగా కొన్ని న్యాయ మర్యాదలుంటయ్. వాటిని అతిక్రమించితే దేశం యొక్క గౌరవ మర్యాదలు దెబ్బతింటయ్. అంతేకాకుండా మన రాజ్యాంగానికి సంబంధించినవికూడా కొన్ని ధర్మాలుంటయ్. వాటిని సహితం దృష్టిలో వుంచుకుని వ్యవహరించవలసి వుంటుంది.

కాందిశీక ఆస్తి వ్యవహారాల శాసనంలో కొన్ని మార్పులు చేయించ వలసిందిగా కోరుతూ గిద్వానీ గారు వ్రాసిన లేఖకు సమాధానంగా నెహ్రూ పై లేఖను వ్రాశారు.

### చేనేతవస్త్రాలు—సహకార సంఘాలు

మదరాసు సహకారసంస్థల రిజిస్ట్రారు గారి అధ్యక్షతను జిల్లా సహకార టోకు వ్యాపార సంస్థల ప్రతినిధుల సభయందు, 28 సంస్థలు చేరి రూ 20,000 విలువగల చేనేత వస్త్రాలు నెలకు కొని విక్రయించుటకు తీర్మానించబడెను. మిల్లువస్త్రాల కోటా కూడ పుచ్చుకొని, తను లాభం మార్జిను తగ్గించుకొని తక్కువ ధరకు విక్రయించుటకు తీర్మానించబడెను.

# "పన్నుల ద్వారా వచ్చే ధనాన్ని ప్రజలకే వినియోగిస్తాము"

## ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారి వివరణ: కడియంలో స్త్రీజనాభ్యుదయ శాఖకు ప్రారంభోత్సవం

రాజమహేంద్రవరం, డిసెంబరు 9:–మదరాసు ఆర్థికశాఖామంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు నిన్న సాయంత్రం యీ తాలూకా కడియం గ్రామంలో స్త్రీ జనాభ్యుదయ శాఖకు ప్రారంభోత్సవం జరిపిరి. పతాక ప్రతిష్ఠాపన, బాలికలచే కోలాటము అయిన పిమ్మట స్త్రీ జనాభ్యుదయ శాఖవారు మంత్రిగారికి స్వాగతపత్రము సమర్పించుచూ నూలువడకుట, మగ్గములపై నవారు నేయుట, పండ్లరసము తయారుచేయుట మున్నగు వస్తు పరిశ్రమలను యిప్పటి అవసరాలలో పెట్టుచున్నామని తెల్పి యీ గ్రామంలో సరియైన నీటి సరఫరాలేక పచ్చి బాలెంతరాలుకూడ కాలువకు నీటికై పోవలసి వచ్చుచున్నదనీ, ఆసుపత్రిలేదనీ, ఉన్నతవిద్యా సౌకర్యములు లేవనీ వివరించి యిట్టి యిబ్బందులను వెంటనే తొలగజేయవలెననీ కోరిరి.

తర్వాత దువ్వూరి సుబ్బమ్మగారు మాట్లాడుచూ నిత్యజీవితంలో అవసరమైన అన్నివస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయినందువల్ల సామాన్య కుటుంబీకులు కాలం వెళ్లబుచ్చుకొనుటయే దుర్లభముగా నున్నదనీ, యీ విపత్కర, విషమపరిస్థితులను లొంగి నలిగిపోవుచున్న పాఠశాలోపాధ్యాయులవంటి చిన్న ఉద్యోగులకు ప్రభుత్వం జీతాలు హెచ్చించి వారిని దయతో చూడవలెనని చెప్పిరి. కాఫీ హోటళ్లు, పొగాకు పరిశ్రమ బ్లాక్ మార్కెట్టు యీ మూడూ పోయినగాని ప్రజలు సుఖజీవనం గడుపలేరనికూడ చెప్పి దేశమును సౌభాగ్యవంతముగ తయారు చేయుటకు స్త్రీ జనాభ్యుదయశాఖవారు చేయవలసిన కృషి యెంత అయినా వున్నదని సుబ్బమ్మగారనిరి.

కడియం ఫిర్కా అభివృద్ధి శాఖాధికారి సి. హనుమంతరావుగారు నివేదిక సమర్పించుచూ కొన్ని క్రొత్త రోడ్లు వేయించుటకు, నూతులు త్రవ్వించుటకు కృషి జరుగుచున్నట్లు తెల్పిరి.

శ్రీమతి అమ్మన్నరాజాగారు (డిప్యూటీ స్పీకరు) స్త్రీ జనాభ్యుదయ శాఖవారి కృషిని ప్రశంసించుచూ ప్రసంగించిన తర్వాత తూర్పుగోదావరిజిల్లాబోర్డు అధ్యక్షులు మారిన సర్వసన్నగారుపన్యసించుచూ జిల్లాబోర్డుకు సంబంధించినంతవరకూ హయ్యర్ ఎలిమెంటరీ స్కూలుగాని, మిడిల్ స్కూలుగాని స్థాపించుట—చిన్న చిన్న రోడ్లు వేయించుట మున్నగు పనులన్నీ తాము చేయించగలమని చెప్పి, ఫిర్కా అభివృద్ధివల్ల ప్రజలకు ఏ మాత్రమూ సౌకర్యములు కలుగలేదనీ, యీ విషయం ప్రజలే తమంతట తాము చెప్పకొనుచున్నారనీ, అందుచేత రాజకీయాలతో సంబంధంలేని నిర్మాణ కార్యక్రమాభిలాషులనే యీ శాఖలో నుంచవలెననీ అనిరి రాజకీయాలతో ప్రమేయం లేని ఒక ఉద్యోగిని యీ శాఖలో నియమించి, జిల్లా కలక్టరు, జిల్లాబోర్డు ప్రతినిధి, జిల్లా ఆరోగ్యశాఖాధికార్లతో కూడిన సలహాసంఘముయొక్క సూచనల ననుసరించి ఆ ఉద్యోగి పనిచేసినచో త్వరలో ఫిర్కా అభివృద్ధిశాఖవల్ల అమోఘమైన పనులు జరుగుననీ అనిరి.

పైడా వెంకటనారాయణ (యం. యల్. ఏ.)గారు మాట్లాడుచూ సర్వసన్నగారు చెప్పినట్లు ఫిర్కా అభివృద్ధిశాఖలో ఏ గెవిన్మెంటు ఉద్యోగినో నియమించిన ఆ ఉద్యోగికి యీ కార్యక్రమమే అర్థం కాదనీ, అదీగాక ప్రజాప్రభుత్వ హయాములో అట్లు చేయుట పొరపాటు అనీ చెప్పిరి. స్త్రీ జనాభ్యుదయ శాఖవారి కృషిని గురించి మాట్లాడుచూ యిట్టి సంస్థలకు ప్రభుత్వం ఆర్థికంగాను, యితరవిధాలగాను కూడ సహాకరించవలెనని అనిరి.

పిదప కడియంగ్రామ ప్రముఖులు కొందరు మాట్లాడుచూ తమకు ముఖ్యంగా యీ సం॥రం రెండవపంటకు నీరు కావలెననీ, మురుగునీరు పోవుటకు ప్రయి వేటు కావలెనని మంత్రిగార్ని కోరిరి. సబ్‌కలక్టరు టి. యస్. లక్ష్మినారాయణన్‌గారు, రెండవ పంటకు తప్పక నీరు అందజేయబడునని వాగ్దానమిచ్చిరి.

అనంతరం మంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు యిట్లు ప్రసంగించిరి.

"స్త్రీ జనాభ్యుదయశాఖ ప్రారంభోత్సవ సందర్భంలో యీ కడియం గ్రామానికి వచ్చే అవకాశం లభించినందుకు నేను చాల ఆనందించుచున్నాను. కడియంచాల ప్రసిద్ధమైనది. ఇటువంటి ప్రదేశంలో వారే ప్రభుత్వాన్ని ఏవేవో కోరికలు కోరుచున్నారు. మీరు కోరేవన్నీ సహేతుకమైన కోరికలే. వానిలో దేనినికాని అనవసరమైనదని ఎవరూ చెప్పలేరు. కాని యింతకంటే హీనస్థితిలో నున్న గ్రామాలను మొదట అభివృద్ధిపరచవలసి యున్నది. అన్నీ ఒకసారి చేయుటకు ప్రభుత్వానికి ధనం చాలదు. మీరిచ్చు పన్నుల ద్రవ్యమునే, మీసౌకర్యములకు ప్రభుత్వం ఖర్చు పెట్టునుగాని మీ రిచ్చిన ద్రవ్యమును అధికారమును, ప్రభుత్వం వినియోగించదు. కాంగ్రెస్ ప్రచారకులు యితరులు చేసేది సేవ యిపుడు ప్రభుత్వం చేయవలసివున్నది. తద్వారా చాల ధనాన్ని ప్రభుత్వం కోల్పోతున్నది. అయినా ప్రజాసౌభాగ్యంకోసం వాటిని లెక్కచేయుటలేదు. ఉదాహరణకుగా, మద్యనిషేధ కార్యక్రమమును చూడండి. ప్రభుత్వానికి సంవత్సరానికి 17 కోట్ల రూ నష్టం సంభవించుచున్నా దానిని అమలు జరిపితిమి. ఒక ప్రక్క యిలా ఆదాయం తగ్గిపోయి మరొక ప్రక్క దినదినం ఖర్చు అధికమవుతూంటే ప్రభుత్వం ఎలా సర్దుకోగలదు?

నేడో రేపో మనకు ఆంధ్ర రాష్ట్రం సిద్ధించనున్నది. దానిని బలవత్తరంగా తయారుచేసికొనవలెనన్న ప్రజలు ఎక్కువగా పన్నులు యిచ్చి ప్రభుత్వానికి తోడ్పడాలి. అంతేగాని ఏ కేంద్రప్రభుత్వమో మనకు ధనసంపత్తి చేకూర్చునది కావనాదు. ఇదివరకు ప్రభుత్వం యొక్క కర్తవ్యం పన్నులు వసూలుచేయుట, అల్లర్లు మొదలైనవి జరగకుండా చూచుట మాత్రమే. ఇపుడు ప్రతివారూ ప్రతి చిన్న పనికి ప్రభుత్వం మీదనే ఆధారపడుచున్నారు. ఏదో ఒక విధంగా ముందు ప్రజలకు సౌకర్యాలు కల్గించవలెనను తలంపుతో పోనా రైతులవద్దనుండి ద్రవ్యమును అప్పుగాసైన తీసికొని కొంతకాలం తర్వాత వడ్డీతో సహా వారికి చెల్లించవచ్చునని ప్రభుత్వం సంకల్పించినది. కాని కొంతమంది యీ విషయంలో ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించుచున్నారు. ఇట్టి క్లిష్టపరిస్థితులలో ప్రజానీకం గూడ కొంత ఓర్పు వహించవలెను."

స్త్రీ జనాభ్యుదయమును గురించి మాటాడుచూ గోపాలరెడ్డిగారి ట్లనిరి:

"స్త్రీల అభివృద్ధికోసం అనేక విధాల పాటుపడ్డ వీరేశలింగం పంతులు వంటి మహామహుల్ని మనం మరువలేము. ప్రభుత్వం గూడ స్త్రీ జనాభ్యుదయశాఖ నొకటి స్థాపించి దానికొఱకై సం॥రమునకు 8 లక్షలు వ్యయపరచుచున్నది. ఇచ్చటి స్త్రీలు నిర్మాణ కార్యక్రమాచరణ కోసం కృషిచేయుట చాల ఆనందకరమైన సంగతి. ప్రతివారూ స్త్రీజనాభ్యుదయంకొఱకు సహకరించి వారికి సంఘంలో తనగౌరవస్థానమునీయవలెను."

జనగణమన ప్రార్థనతో కార్యక్రమము సమాప్తి పొందెను. ఈ సభకు వచ్చుటకే నిన్న సాయంత్రం రైలులో గోపాల రెడ్డిగారు వచ్చి గోదావరి స్టేషనులో దిగగానే అనేక మంది అధికార అనధికార ప్రముఖులు వారికి స్వాగత మిచ్చిరి.

## పబ్లిక్ (ఆంధ్రరాష్ట్ర) డిపార్టుమెంటు నిర్మాణం

### శ్రీ యస్. వెంకటేశ్వరన్ కార్యదర్శి

మదరాసు, డిసెంబరు 10: ఆంధ్రరాష్ట్రనిర్మాణ కార్యకలాపం నిమిత్తం మదరాసుప్రభుత్వము క్రొత్త డిపార్టుమెంటును నిర్మించెను. ఈ డిపార్టుమెంటును పబ్లిక్ (ఆంధ్రరాష్ట్ర) డిపార్టుమెంటు అనెదరు. విభజనసంఘ కార్యదర్శి శ్రీ యస్. వెంకటేశ్వరన్ ఐ. సి. యస్. డిపార్టుమెంటుకు కార్యదర్శిగ నియమింపబడిరి.

ఎలెక్షన్ కమిషనర్ పనిని చూచుటకు సేలంజిల్లా కలెక్టరు శ్రీ యస్. ఆర్. వైనార్‌ను డిప్యూటీ కార్యదర్శిగ నియమించిరి. డిప్యూటీ కలెక్టరు శ్రీ సి. యస్. రామచంద్రన్ సేలంజిల్లా కలెక్టరుగా నియమింపబడిరి.

## విభజనసంఘ సభ్యుల ఢిల్లీ ప్రయాణం

చెన్నపట్నం, డిసెంబరు 10: చెన్నరాష్ట్ర విభజనసంఘ సభ్యులైన శ్రీ కళా వెంకట్రావుగారు నిన్నరాత్రి కలకత్తా మెయిలులో బెజవాడ వెళ్లిరి. అక్కడనుంచి 14 వ తేదీ ఆలమూరువద్ద గోదావరి వంతెనకు శంకుస్థాపన జరిపి 15 వ తేదీ ఉదయం ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీ వెళ్లెదరు. శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు ఆదివారం బయలుదేరి ఢిల్లీ వెళ్లెదరు. శ్రీ ప్రకాశంగారు గూడా వీలునుబట్టి ఢిల్లీ వెళ్లుటకు ఆలోచించుచున్నారు.

శ్రీ కృష్ణమాచారిగారు ఢిల్లీ వెళ్ళిన వెంటనే రాష్ట్రపతి పట్టాభిసీతారామయ్యగారిని, తదితర కేంద్రోద్యోగులను దర్శించి జనవరి 26 వ తేదీలోపల రాష్ట్రమును నిర్మింప సాధ్యమగునేమో చర్చించెదరని తెలియుచున్నది.

మద్రాసుప్రభుత్వ విభజనసంఘంవారి కార్యక్రమము శీఘ్రముగా జరిగిపోవుచున్నదనియు, ఉజ్జాయింపుగా విభజన జనవరి 15 వ నాటికి జరిగిపోవచ్చుననియు ఆ ప్రకారము షెడ్యూలులో రాష్ట్రమును చేర్చుటకు కేంద్రప్రభుత్వమువారు తమసవరణలను మార్చుకొనవలెనని తాము కోరెదమని శ్రీ కళా వెంకట్రావు గారు ఆంధ్రపత్రిక ప్రతినిధితో తెలిపిరి.

జనవరి 26 లో వలగవర్నరు జనరల్ ఉత్తర్వుచ్చి, ఆంధ్రరాష్ట్రము షెడ్యూలులో చేర్చుటకు వీలుపడనిచో ఏప్రిల్ 1 తేదికి రాష్ట్రము రాగలదను హామీ ఎక్కడాలేదనియూ, జనవరి 26 కు రాకపోతే అది ఒకటి, రెండేళ్లు గూడా ఆలస్యముగా వచ్చునని ఆంధ్రపత్రిక ప్రతినిధితో ఒక ఆంధ్రనాయకుడు తెలిపెను. తమిళనాయకులు ఆంధ్రులను 'వేరె రాజధానికి పొమ్మన్నప్పుడు ఆంధ్రులకు ఉన్న కష్టము తెలియనివారు' కారనియూ, వారే సబబును గ్రహించి, న్యాయము చెయ్యగలరని ఆశించుచున్నామని ఆయన తెలిపెను. డిసెంబర్ 21 తేది నాటికి ఈ విషయము తేలిపోగలదని వారు ఆశించుచున్నామని తెలిపిరి.

# "దౌర్జన్యం మతవిద్వేషం ఇవి మనకు ప్రబలశత్రువులు"

## భారతప్రధాని నెహ్రూ హెచ్చరిక

ఫరూకాబాద్, డిసెంబరు 10: ఫరూకాబాదులో లౌకిక ప్రజాస్వామ్యవక్షంవారిచే ఏర్పాటు చేయబడినసభలో నేడు భారత ప్రధాని పండిట్ నెహ్రూ ఉపన్యసించుచు ఇట్లు చెప్పెను:

"క్రొత్తగా ఉదయించిన మన స్వతంత్ర ప్రజారాజ్యమునకు దౌర్జన్యమార్గమున్నూ, మత విద్వేషమున్నూ రెండు ప్రబల శత్రువులై యున్నవి. కార్మికులను కర్షకులను ఉద్ధరించుటకు ప్రయత్నిస్తున్నామని కమ్యూనిస్టులు పైకి ప్రకటించుచు దౌర్జన్యములను చేయుచున్నారు. దేశములోని ఏ రాజకీయపక్షమునకైనను దౌర్జన్యమార్గముల నవలంబించుటకు అవకాశమిచ్చినయెడల దేశము సంక్షోభముపాలై ముక్కలు ముక్కలు కాగలదు."

హిందూ సంస్కారమునే విస్తరింపచేయవలెనని మనము ప్రత్యేకాభిమానంతో ప్రభుత్వమును సాగించే యెడల యీ దేశంలో హిందూజాతి వేరనియు, మహమ్మదీయజాతి వేరనియు ఇదివరలో ఏ ద్విజాతీయ సిద్ధాంతమును పాకిస్తాను వాదులు ప్రచారం చేయగా, కాంగ్రెసు తీవ్రంగా ప్రతిఘటించియుండెనో దానినే మనము తిరిగి అంగీకరించినట్లగును. కాశ్మీరులోని జనులు విశేషంగా మహమ్మదీయులు అయినప్పటికీ వారందరు మన పక్షమున చేరియున్నారు. వారి రక్షణార్థము మన సేనలను అచటికి పంపియున్నాము. మనము ద్విజాతీయ సిద్ధాంతమునే ఆమోదించి హిందూ సంస్కారమునే అభిమానించినవారమైన యెడల కాశ్మీరుకు మన సేనలను పంపియుండెడివారము కాము.

కాందిశీకుల ఆస్తి విషయములో జారీ చేయబడిన ఆర్డినెన్సును గూర్చి ఆందోళన యొకటి ప్రారంభింపబడినది. ఈ విషయములో పాకిస్తాన్ అవలంబించిన పద్ధతినే మనముకూడా అనుకరించుట పాడిగాదు. అట్టిది భారతదేశమునకు అనర్థదాయకము. ప్రపంచంలోకల్ల మతాభిమాన ప్రధానమైన రాజ్యము పాకిస్తాను తప్ప ఇంకొకటి లేదు. భారతదేశం ఆ విషయములో పాకిస్తానును అనుకరింపజాలదు. పైజెప్పిన ఆర్డినెన్సును జారీచేయుటయందు భారతప్రభుత్వ ప్రధానినైన నేను పూర్తిగా బాధ్యత వహించుచున్నాను. ఆబాధ్యతను తప్పించుకొనుటకు కించిత్తయినను యత్నించను. ఈ ఆర్డినెన్సు న్యాయసూత్రసమ్మతమైనది. ఇట్టి న్యాయసూత్రముల ననుసరించుటవల్లనే భారతదేశము పురోభివృద్ధి నందగలదు.

ప్రజాస్వామ్య ప్రభుత్వము యొక్క మూల సూత్రములను బాగుగా గ్రహించవలెను. కేంద్రప్రభుత్వమునకు బలమైన అధికారమును కల్పించునప్పుడు ప్రజల వ్యక్తిస్వాతంత్ర్యమునకు భంగము కలుగనీయరాదు. రష్యాలో వ్యక్తి స్వాతంత్ర్యమును భంగపరచి కేంద్రప్రభుత్వము తన అధికారమును యథేచ్ఛగా చలాయించుటవల్లనే కొంత అభివృద్ధిలోనికివచ్చినది. రష్యాలో అధికారము వహించినపార్టీకి వ్యతిరేకంగా రష్యా ప్రజలలో ఎవ్వరున్నూ ఇటు మెసలుటకుగాని అటు మెసలుటకుగాని వీలులేదు. రష్యా పద్ధతిని భారతదేశము అనుకరింపజాలదు. అట్టి వ్యక్తిస్వాతంత్ర్య నిరోధంవల్ల ప్రజల స్వతంత్ర కల్పనాశక్తులను నిర్మాణ సామర్థ్యమును నిర్మూలించుట యగును. దేశంలో ప్రజలు నిరుపేదలై యున్నప్పుడు వారికి స్వాతంత్ర్యం ఇచ్చినను ప్రయోజనంలేదు. వారు అభివృద్ధిలోనికి వచ్చుటకు అవకాశములు లేనప్పుడున్నూ ప్రభుత్వ పరిపాలనా వ్యవహారములను నిర్ణయించుటలో వారికి పలుకుబడిలేని యెడలను వారి కివ్వబడిన స్వాతంత్ర్యం నిరుపయోగం.

## 'బిందూగారితో సంపూర్ణ సహకారం'

### స్వామీ రామానందతీర్థ ప్రకటన

సికింద్రాబాద్, డిసెంబరు 10: హైద్రాబాద్ సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షపదవినుండి విరమించిన స్వామి రామానందతీర్థగారు యీ క్రింది ప్రకటన చేశారు.

"హైద్రాబాద్ రాజకీయ జీవితములో పట్టువిడిపోయి, పరిస్థితులను సహజస్వరూపం తెచ్చే మా సేవాకాలంపూర్వమైనందుకు హర్షిస్తున్నాను. పరిస్థితుల సానుకూలానికి నేను చేయవలసినదంతా చేశాను. నాకర్తవ్యం ముగిసింది.

రానున్న సంవత్సరానికి సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నుకోబడిన దిగంబరరావు బిందూగారికి నా అభినందనలు. బిందూగారు అనేకరంగాలలో ప్రజాసేవానుభవం కలవారు. సంస్థాన కాంగ్రెస్ ప్రారంభించిన స్వాతంత్ర్య పోరాట విజయం చాలవరకు బిందూగారి నైపుణ్యంవల్లనే. సంస్థానాభివృద్ధికి వారు చేయబోవు కార్యక్రమంలో వారికితోడ్పడటం మనవిధి. వారికి నా సహకారం యెల్లవేళలా లభించగలదు."

# "కర్నూలుజిల్లాలోని పత్తికొండ తాలూకాను ఆంధ్రలోనే చేర్చాలి'

## కన్నడిగలవాదనపై కర్నూలు సభలో తీర్మానం

కర్నూలు, డిసెంబరు 8: ఈ పట్టణ కాంగ్రెసు సంఘంవారి ఆధ్వర్యమున నిన్న సాయంత్రం అధ్యక్షుడు కొసల చిన్న తిమ్మయ్య గారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో ఆంధ్ర రాష్ట్రమునకు మదరాసు తాత్కాలికముగా రాజధానిగా నుండవలెననియు, నూతన రాజ్యాంగ చట్టము ప్రకారము ఆంధ్ర రాష్ట్ర శాసన సభకు యెన్నుకోబడిన ప్రతినిధులు రాజధాని విషయమై నిర్ణయమునకు వచ్చువరకు పై తెలిపిన యేర్పాటు ఉండవలెననియూ తీర్మానము ఆమోదింపబడెను.

నూతన రాజ్యాంగ చట్ట ప్రకారము ఆంధ్ర రాష్ట్ర శాసనసభకు కోస్తా జిల్లాల నుండి యెన్నుకోబడు ప్రతినిధులసంఖ్యకు సమానముగా రాయలసీము జిల్లాలకు కూడ నుండవలెననియు, రాయలసీమ నుండి యెన్నుకోబడు ప్రతినిధుల సంఖ్య తక్కువగా నున్నందున మిగత వారిని నామినేట్ చేయవలెననియు మరియొక తీర్మానము కూడ ఆమోదించిరి. కర్నూలు జిల్లాలోని పత్తికొండ తాలూకా ఆంధ్రులకు చెందిన ప్రాంతము కాబట్టి దీనిని ఆంధ్రరాష్ట్రములోనే యుంచవలెనంటూ, కన్నడిగలు యీ తాలూకా తమదని చెప్పు వాదనని ఖండించుచు తీర్మానించిరి.

రాయలసీమ జిల్లాలకు ప్రత్యేక విశ్వవిద్యాలయము యేర్పాటు చేయవలెనని మరియొక తీర్మానము ఆమోదించిన పిదప పై తీర్మానములను గురించి కాంగ్రెసు అధ్యక్షుడు, పండిత నెహ్రూ, పటేల్ గార్లకు స్వయముగా తెలుపుటకు ఒక రాయబార వర్గమును యెన్నుకొనిరి.

## 'ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమ చేరాలి'

### పప్పూరి రామాచార్యులు గారి ప్రసంగం

ఆదోని, డిసెంబరు 4: నిన్నటి దినం ఇచ్చట మునిసిపల్ మైదానంలో శ్రీ ఆర్. రామిరెడ్డిగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. ఆంధ్రరాష్ట్రములో రాయలసీమ కలిసిఉండుట శ్రేయస్కరమని శ్రీ పప్పూరి రామాచార్యులుగారు నుడివిరి.

ఆదోని, ఆలూరు, రాయదుర్గం ఈ మూడు తాలూకాలు తెనుగు తాలూకాలని నిర్ణయింపబడినవనీ, ఇంకను కొన్ని గ్రామాలు తెనుగు తాలూకాలలో చేర్చుకోవలసినవిగా ఉన్నవనీ నారన్నారు.

శ్రీ టి. జి. తిమ్మయ్య, నారాయణరెడ్డి, ఏమునూరాజులు ప్రభృతులు కూడా మాట్లాడిరి. (స్వ. వి.)

# "దేశం అభివృద్ధిచెందాలంటే ప్రజలు కష్టించి పనిచేయాలి"

## ఫరూకాబాద్ పురపాలకసంఘ సన్మానం: ప్రధాని నెహ్రూ ఉద్బోధ

ఫరూకాబాద్, డిసెంబర్ 9: 'భారతదేశం సంపద్సమృద్ధమై అభివృద్ధిచెందాలంటే ప్రజలంతా కష్టించి పనిచేయాలి' అని ప్రధాని నెహ్రూ ఈవేళ ఫరూకాబాద్ పురపాలసంఘంవారి సన్మానానికి సమాధానమిస్తూ ప్రకటించారు.

'మనం జీవచ్ఛైతన్యం గలమనుషులమో మృతకళేబరాలమో తెలుసుకోవటానికి ప్రపంచమున్ని సయ్యికళ్ళతో కనిపెట్టి చూస్తున్నది. ఇది మన ప్రతిభా సంపత్తులను ప్రదర్శించుకోవలసిన తరుణం. కష్టపడి పనిచేస్తేనేగాని మన పథకాలేవి విజయవంతంకావు. ఎట్టి ఆదర్శమైనా కష్టించి పనిచేస్తేనేగాని సాధనకు రాదు!' అన్నారు.

'నేను 12 సంవత్సరాలక్రితం ఒకసారి యీ పట్నానికి వచ్చాను. అప్పటికీ ఇప్పటికీ మార్పేమీలేదు. అంటే యీపట్నం సరియైన అభివృద్ధిక్రమంలో లేదన్నమాట. ఇది యీ ఒక్కపట్నం సంగతేకాదు. భారతదేశంలోని పట్నాలన్నిటిస్థితీ ఇదే మోస్తరుగా వుంది. ఇదే విదేశీనగరాలలో అయితే సంవత్సర సంవత్సరానికేదోయింతో మార్పు మీకు గోచరిస్తుంది. భారతదేశంలో పౌర సన్మానాలు ప్రదర్శించటంలో వున్న శ్రేయస్కరం నగరాలను అభివృద్ధిలోకి తీసుకురావటంలో చూపబడటం లేదు, పైగా అలాంటిఅవకాశాల్లో ప్రభుత్వసహాయాన్ని అర్థించుతూ అనేకకోరికల జాబితాలను అందజేయుటవ అదో ఆచారమైంది. అల్లాంటి అలవాటు వాడుకచ్చును. సన్మానపత్రాల్లో అల్లాంటి కోరికలు తెలియజేయటం ఆరోగ్యవంతమైన ఆత్మగౌరవానికి భంగకరంగా నేను పరిగణించుచున్నాను. విదేశాలలోవలే ఇలాంటి సంస్థలు తమకుకల దక్షతలను, తాము సాధించిన కార్యాలనీ చెప్పుకుని గర్వించటం నేర్చుకోవాలి.

'మనం ఏదో సంస్కృతి సంస్కృతి అంటూ పదేపదే మాట్లాడుతూవుంటాం. కాని మనం దైనందిన జీవితచర్యలలోమాత్రం అదెక్కడా కనుపించదు. అదంతా కేవలం మన గ్రంథాలలోమాత్రమే నిలిచివున్నదే గాని, మన మాటల్లోనూ, చేతల్లోనూ, కనుపించదు. మన ఆలోచనలలోనూ, హృదయంలోనూ అది కరువైపోయినందుకు తాలద్దీ, సంస్కృతి విషయమై మనం పెద్దపెట్టున గొప్పలు చెప్పుకుని లాభంలేదు. గతచరిత్రనంతా నెమరువేసుకొనటంలో మనంకాలాన్ని వృథాచేస్తున్నాం. ప్రస్తుతం మనముందున్న ఎదుర్కొంటున్న వాస్తవిక సమస్యల నన్నిటినీ గాలికివదిలివేస్తున్నాం. ఇక్కడికి 31 సంవత్సరాలక్రితం సోవియట్ రష్యాలో ఎలాంటి విప్లవం పరిణామాలు వచ్చాయో అలాంటి విప్లవ పరిణామాలు నేడు ఆసియాదేశాలన్నిటిలోనూ వస్తున్నవి. ఈ విషయాన్ని మీరు యెంత జాగ్రతగా గమనించితే అంత ప్రయోజనకరం. వారివారి రాజకీయ సిద్ధాంతాలు ఎలాంటివైనా ప్రజలు జాతికి సంపదను చేకూర్చటానికి ప్రయత్నించి తీరాలి. అమెరికా, రష్యాలు అంతంత మహత్తరమైన అభివృద్ధిని సాధించాయంటే అదంతా కేవలం, సిద్ధాంతాలను మాట్లాడుతూ వుండటంవల్లనూ, కాగితాలమీద పథకాలను తయారుచేయటంవల్లనూ సాధించబడలేదు. ఆ పథకాలనన్నిటినీ కార్యరూపంలో సాధించటంవల్ల విజయం కలిగింది. దురదృష్టవశాత్తూ భారతదేశంలో ఇలాంటి పరిస్థితి యెక్కడా కనుపించటంలేదు. సిద్ధాంతాలు తయారుచేయటంలో కనుపిస్తున్న సరదా పనిపాటల విషయంలో మృగ్యంగావుంది' అన్నారు.

పురపాలకసంఘం నెహ్రూకు ఈ సన్మానపత్రాన్ని సమర్పిస్తున్న కారణంగా, సం. రాష్ట్ర రాజకీయ మహాసభ విషయనిర్ణయసంఘ సమావేశాన్ని కొంతసేపు నిలుపుచేశారు.

# మద్రాస్ సెక్రటేరియట్‌లో ఆంధ్రఉద్యోగులవివరాలు

## ప్రత్యేకాంధ్ర ప్రభుత్వానికి కావలసిన ఉద్యోగుల సంఖ్య: అధికార అంచనా

ప్రస్తుత మద్రాసు ప్రభుత్వ సెక్రటేరియట్‌లో ఉన్న 889 మందిలోనూ తెనుగు ఉద్యోగులు 244 మందిమాత్రం ఉన్నారు. ప్రత్యేకాంధ్ర సెక్రటేరియట్‌కు 330 మంది కావాల్సి ఉంటారని అంచనావేయబడింది. తరగతి వారీగా ఇందుకు సంబంధించిన వివరాలు దిగువ ప్రకటింపబడినవి.

| డిపార్టుమెంట్ | గెజిటెడ్ ఉద్యోగులు | సూపరింటెండెంట్లు | అప్పర్ డివిజన్ గుమాస్తాలు | లోయర్ డివిజన్ గుమాస్తాలు | టైపిస్టులు స్టెనో టైపిస్టులు |
|---|---|---|---|---|---|
| 1. చీఫ్ సెక్రటేరియట్ | 1 | 5 | 21 | 7 | 6 |
| 2. హోం డిపార్టుమెంట్ | 1 | 1 | 19 | - | - |
| 3. ఆర్థికశాఖ | - | 5 | 5 | 1 | - |
| 4 రెవిన్యూ | 2 | 5 | 10 | - | 10 |
| 5. డెవలప్‌మెంట్ | 2 | 5 | 25 | 5 | 5 |
| 6. స్థానిక పరిపాలన శాఖ | - | 4 | 2 | - | - |
| 7 విద్యారోగ్య శాఖలు | - | 2 | 10 | - | ఄ |
| 8. సామ్యూహిక ఇలాకా శాఖ | 2 | 4 | 21 | I | 8 |
| 9. న్యాయశాఖ | 2 | 1 | 2 | 8 | - |
| 10. ఫిర్కాభివృద్ధి | 2 | 4 | 7 | - | 8 |
| 11. ఆహార వ్యవసాయ శాఖలు | 1 | 5 | 15 | - | - |
| 12. శాసనసభ శాఖ | 3 | 2 | 1 | - | 4 |
| మొత్తం | 16 | 43 | 188 | 17 | 31 |
| ఆంధ్ర సెక్రటేరియట్‌కు కావలసిన సిబ్బంది | 25 | 65 | 150 | 40 | 50 |
| ప్రస్తుత మద్రాసు సెక్రటేరియట్ సిబ్బంది | 64 | 175 | 400 | 100 | 150 |

## రాజధాని విషయమై తమిళుల పట్టుదల

### ఆస్తి అప్పులగూర్చి విభజనసంఘ చర్చ

చెన్నపట్నం, డిసెంబరు 10: ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగూర్చి ఇతరవిషయముల వివరముల తేల్చుటకు పూర్వము ఆంధ్రులు రాజధానీ నగరమునుగూర్చి హైకోర్టు పెట్టుకొను స్థలముల పేర్లు నిర్ణయించవలెనని నదిగా తమిళనాయకులుపట్టుబట్టుచున్నట్లు ఆంధ్రులు మద్రాసు వదలి వెళ్ళిపోయినటుల లాంఛనమైన ఏర్పాటుల చేసినచో, మద్రాసులో ఆంధ్రప్రభుత్వ కార్యాలయములు ఆంధ్ర రాజధానీ నగర సన్నాహములు పూర్తి అగువరకు ఉండుటకు తాము ఎట్టి ఆక్షేపణ చెప్పమని వీరు తెలుపుచున్నటులూ తెలియుచున్నది. ఆంధ్రమంత్రులూ, ఆంధ్ర శాసన సభ సమావేశములూ చెన్నపట్నంలోగూడా ఉండరాదని ఒక పరి తమిళ నాయకులు వాదించినటుల తెలియుచున్నది. ఆంధ్రదేశములోని పట్టణముల, భవనముల స్థితి తమిళనాయకులకు తెలిసినదే గనుక వారే ఆ పట్టణముల పేర్లు చెప్పివచ్చునని ఆంధ్రనాయకుల వాదమై ఉన్నది. ఆంధ్రులు మద్రాసులో తాత్కాలికముగా రాజధానీనగరము పెట్టుకొనుటకు తమిళరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు కామరాజనాడారుగారూ, భారతప్రభుత్వ ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు అంగీకరించి ఉన్నారనియు, అంగీకరించినను, తమిళనాయకులు ఇట్టి వైఖరి ప్రదర్శించుట విచిత్రముగా ఉన్నదని ఆంధ్రనాయకులు తలచుచున్నారు.

నిన్న విభజన సంఘమువారు ఈ విషయమును ఒకసారి చర్చించి డిసెంబరు 21 వ తేదీకి తమ అభిప్రాయములను నిర్ణయించుకొని రావలెనని వాయిదా వేసినటుల తెలియుచున్నది.

శాశ్వత ఆస్తి అప్పుల పంపకమును గూర్చి, బడ్జెటునుగూర్చి స్థూలంగా చర్చించినటుల తెలియుచున్నది.

చెన్నరాష్ట్ర అప్పు సుమారు 81కోట్లు, నిల్వలు 45 కోట్లు ఉన్నట్లు అధికారవర్గములవారు తెలుపుచున్నారు. ఆంధ్ర జిల్లాలకు నీటి పారుదల సౌకర్యముకొరకు గూ 10 కోట్లు, దక్షిణ జిల్లాలకు 8 కోట్లు ఋణములు చేసినట్లను దక్షిణాది జిల్లాలకు విద్యుచ్ఛక్తికి తెనుగు జిల్లాలకన్న అధిక ఋణమును చేసినటులను తెలుపుచున్నారు. ఆంధ్ర తమిళజిల్లాలబడ్జెట్లు లోటుగానే ఉండుననియు, చెన్నపట్నము వ్యయంకన్న ఆదాయం అధికమైనందున మిగులుగా ఉన్నట్లును లెక్కలు తెలుపుచున్నవి. చెన్నపట్నంలోని ఆదాయం మిగులును. ఇంతవరకు ఆంధ్ర తమిళజిల్లాల ఆయవ్యయములను పరికింపగా ఆంధ్రజిల్లాలపై 38% బాపులవెచ్చించుటకు బదులు 34% వెచ్చింపబడెననియు, ఆ భేదమును తెనుగువారికి ముదరా ఇవ్వదగుననియు తమిళనాయకులు తెలుపుచున్నట్లు అభిజ్ఞవర్గములవారు తెలుపుచున్నారు. చెన్నపట్నంలోని మిగులును ఆంధ్రులకు పంచుటకు అంగీకరించలేదు. జనాభానుబట్టి ఆస్తిఅప్పులపంపకం 38% జరవలెనని సూచించుచున్నారు.

ఇక సిబ్బంది. సెక్రటేరియట్‌లో దాదాపు వెయ్యిమంది ఉండగా ఆంధ్రులు దాదాపు 244 మంది ఉన్నారు. ఆంధ్రరాష్ట్రమునకు 350 మంది సెక్రటేరియట్‌కు కావలసి ఉండునని అనుభవజ్ఞులు తెలుపుచున్నారు. ఇక హైకోర్టులో 500 మంది ఉండగా ఆంధ్రులు 50 మంది కన్న అధికముగా లేరనియు ఇక 200 మంది కావలసి ఉండుననియుగూడా హైకోర్టు వర్గములవారు తెలుపుచున్నారు. అవసరమునకు మించిన సిబ్బందిని ఆంధ్రులు స్వీకరింపరాదని ఆంధ్రనాయకుల అభిప్రాయమై ఉన్నది.

## రాష్ట్రవిభజన సంఘ నిర్మాణము

### శ్రీ బి. యస్. మూర్తిగారి ప్రకటన

మదరాసు, డిసెంబరు 8: ఆంధ్రరాష్ట్ర వ్యవసాయకూలీ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ బి. యస్. మూర్తిగారిట్లు ప్రకటించుచున్నారు: మదరాసు ప్రభుత్వము విభజన సంఘమును నియమించుట ముదావహము. ఈసంఘము అప్పుడే ఆస్తి, అప్పులు, డిపార్టుమెంటుల విభజనకు పూనుకొని మునిగి తేలుతో వుండవచ్చును. అయితే కమిటీలో అయిదుగురు మంత్రులెందుకోయని ఆశ్చర్యముగాయున్నది. వారి సమర్థతమాట అటువుంచి కనీసము ఆంధ్ర సభ్యులు అనుభవము. పరిపాలనా దీక్షకలిగిన శ్రీ యస్. వి. రామమూర్తి, శ్రీ వి. రామకృష్ణులను విభజన విషయములలో సలహా ఇచ్చుటకు నియమించియుండవలసినది. మదరాసు సెక్రటేరియట్ అనే నావికా ప్రయాణమును – డి ఆంధ్రరాష్ట్రమునే ఓడను బయటకుతీసే కార్యములో ఆర్థికవేత్త, నాయకుడు శ్రీ యన్. జి. రంగాగారికి స్థానములేకపోవుటెంతయూ విచారకరము. ఇటువంటి సంఘములో మంత్రులైననూ కేవలం రాజకీయ వేత్తలతోనేగాక సెక్రటేరియట్ అనుపూర్వ్యలు తెలిసిన పరిపాలనాదక్షతగల వ్యక్తులు వుండుట చాలఅవసరము. మదరాసునుండి ఒరిస్సాను విభజించు నప్పుడుకూడ విభజన సంఘములో పరిపాలనానుభవముగలవారినే వేసియుండిరి.

మదరాసు ప్రభుత్వము ఇప్పటికైనా శ్రీ యస్. వి. రామమూర్తి, రామకృష్ణా గార్ల సహాకారమును అర్థించి రంగాగారిని కమిటీలో చేర్చవలసినదిగా కోరగలదని ఆశించుచున్నాను.

1950 ఏప్రియల్ వరకు ఆంధ్రరాష్ట్రనిర్మాణమును ఆపు చేయుట మంచిదిగాదు అవసరమున్నా లేదు. ఇండియా నుండి పాకిస్తాన్‌ను విడదీయుటకు మూడునెలలు తీసుకున్నప్పుడు ఈ విభజనను మదరాసు ప్రభుత్వము రెండునెలలలో ఎందుకు ముగించజాలదో వింతగాయున్నది.

## కాళేశ్వరరావుగారి సానుభూతి

విజయవాడ, డిసెంబరు 7: "తమరాష్ట్రనిర్మాణవిషయమై భారతప్రభుత్వము తను చర్యలను తీసికొన నందుకలన, శాసన సభలనుంచి రాజీనామా ఇచ్చిన కర్నాటక మిత్రులకుమా సంపూర్ణ సానుభూతి కర్నాటకరాష్ట్రిందోళనకూడా, ఆంధ్రరాష్ట్రిందోళనయంత పురాతనపు ఉద్యమము. కర్నాటకులకు, కేరళులకు రాష్ట్రము నిర్వహించజా జాప్యము చేయుటలో అర్థములేదు" అని అయ్యదేవర కాళేశ్వరరావుగారు నేడొక ప్రకటనలో తెలియజేసిరి.

"చెన్నరాష్ట్ర విభజన తర్వాత, కర్నాటక, కేరళులస్థితి చాలా చిక్కుగా నుండును, తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానములను కలిపి వేసిన తరువాత, ఐక్యకేరళ నిర్మాణము చాలా తేలికపని. అట్లే దక్షిణకనరా, బళ్ళారిలోని కర్నాటక తాలూకాలను కలిపి వేసినచో కేరళరు ఒప్పుకొనిక ప్రకారము–అవి మైసూరుతో చేరి ఐక్య కర్నాటకమును సాధించుకొనగలవు. హైదరాబాదు విభజన జరుగువరకు విశాలాంధ్ర నిర్మాణము సాధ్యముకాదు. అనాడే సంపూర్ణ కర్ణాటక రాష్ట్ర నిర్మాణముకూడా వీలగును.

మద్రాసును, ద్విభాషాజిల్లాయైన చెంగల్పట్టుతో కలిపి, ప్రత్యేకరాష్ట్రముగా చేసి, తమిళులను మనుపరకో, తిరుచునాపల్లికో లేక కోయంబత్తూరుకో పర్శి రాజధాని ఏర్పరచుకొనవచ్చును. సరిహద్దులను తీరికగా స్పష్టముగా నిర్ణయించుకొనవచ్చును. ప్రస్తుతము స్థూలదృష్టితో పనిని సాగించి అందరకు ఆనందమును కల్గింపవచ్చును.

కాంగ్రెసు హైకమాండు ఈవిషయములలో ఇంత గందరగోళపడుట యెందులకో అర్థముకాలేదు. పైగా ఆంధ్రులు తమిళులు విభజన వివరములపై ఏకాభిప్రాయమును వెల్లడించుట అవసరమని భావించి, మద్రాసు ప్రభుత్వమును ఒక ప్రత్యేక సంఘమును నియమింపమనుమా, భారత ప్రభుత్వ మాదేశించెను. ఇది సానుకూల వ్యాపారము కాజాలదనిపించుచున్నది.

మంత్రి గా॥ శ్రీ గోపాలరెడ్డిగారు: తణుకులో "శ్రీ వెంకటేశ్వరా" అను నూతన సినిమామందిరమునకు ప్రారంభోత్సవం జరిపినప్పుడు తీసిన ఫోటో

గౌ॥ మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు తాడేపల్లిగూడెం వచ్చినప్పుడు ప్రముఖుల సన్మానం: సూర్యచంద్రరావు, అల్లూరి సత్యనారాయణరాజు (పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు) వి. సత్యనారాయణమూర్తి (తాలూకా కాంగ్రెసు ప్రెసిడెంటు) గార్లు మంత్రిగారికి యిరుప్రక్కల గలరు.

## 'ప్రభుత్వోద్యోగులు ప్రజాసేవే పరమలక్ష్యంగా భావించాలి'

### రెవెన్యూమంత్రి సీతారామరెడ్డిగారి హితవు

కడప, డిసెంబరు 9: "ప్రభుత్వోద్యోగులెల్లరు ప్రజల సేవచేయుటకే ఉద్యోగములలో నున్నామని భావింపవలెనని కోరుచున్నాను. ఒకరితోనొకరు సహకరించి పనిచేయుట అవసరమని గ్రహించుచో, అతి స్వల్పకాలములోనే చాలవఱకు ప్రజల కష్టములను తొలగించి వారికి యెక్కువ సహాయ మొనర్పగలరు" అని నిన్న సాయంకాలము రైల్వే ముసాఫర్ బంగళాలో సమావేశమైన జిల్లాఅధికారుల సభలో రెవిన్యూమంత్రి హితవోసంగారు.

నిన్న మధ్యాహ్నము చన్నపట్టణము నుండి సీతారామరెడ్డిగారు ఇటీవల వరదల వల్ల నష్టపడిన ప్రదేశములను చూచుటకై వచ్చిరి. జిల్లా అధికారులనెల్లరిని రావించి యేయేశాఖవారు ఏయే కార్యముల నిర్వహించిరో తెలుసుకొన గోరిరి.

జిల్లా కలెక్టరు బి. మాధవరావునాయుడుగారు ఈ జిల్లాలో యేయే ప్రదేశములు వరదలవల్ల నష్టపడినదియూ, ఎంతవఱకు ప్రతిప్రదేశమునకు నష్టముకలిగినదియూ, ప్రజలకు ఎంతవఱకు తాత్కాలికసహాయమొనర్చినదియూ వివిదీకరించిరి. ఇంజనీరింగు శాఖవారు రోడ్లకు కాజ్‌వేజల కలిగిన నష్టమును తెలిపి వానిని ఎంత త్వరగా రిపేరిచేసినది తెలిపిరి. పి. డబ్లు. యు. శాఖవారు కె.సి. కాలువగండ్లను ఏవిధముగా మరమ్మతుచేసి భూములకు నీటి సప్లయివసతులు కలుగజేసినదీ వివరించిరి.

యన్. రంగారెడ్డి (ఎం. ఎల్. సి.) గారు మాట్లాడుచూ జిల్లా అధికారులలో ఒక శాఖవారికిని, మరియొక శాఖవారికిని అన్యోన్య సహకారభావము లేదనియూ, ప్రతిశాఖ ఉద్యోగియు, తాను స్వతంత్రుడననీ, ఇతర శాఖల ఉద్యోగులతో నిమిత్తము లేదను భావము చాలామందిలో యున్నదనియు తెలిపిరి.

స్వర్ణా నాగయ్య (ఎం. ఎల్. ఏ) గారు కడప పట్టణముల అన్ని భాగముల వారికి కొళాయినీరు త్రాగుటకు అవకాశమున్నను, తోటనాండ్లకు మాత్రము కొళాయినీరు త్రాగు అవకాశము అనేక సంవత్సరములుగా మునిసిపాలిటీ వారు కలుగజేయకున్నారని చెప్పాగా, మునిసిపల్ ఇంజనీయరు, కొళాయిగొట్టములు దొరకనందున తోటవాండ్ల కాలనీలో కొళాయిలు పెట్టుటకు వీలుగాకున్నదని తెలిపిరి. మంత్రిగారు అందుపై తాను వెంటనే కంట్రోలు వస్తువుల కమిషనర్ గారికి వ్రాసి కడప మునిసిపాలిటీకి కొళాయిలు సప్లయిచేయు నెదనని తెలిపిరి.

సభను ముగించుచూ ఇటీవల వచ్చిన వరదలలో ఆయాశాఖ యుద్యోగులు గావించిన పనులకై తాను సంతసించుచున్నాను. ప్రజలు తమ అధికారులనియు, వారి సేవజేయుటకై ప్రతివారును అధికారపదవులయందున్నారనే భావముతో అన్నిశాఖలవారును ఒకరితోనొకరు సహకరించి ప్రజలమేలుకై పాటుపడవలెను." అని సీతారామరెడ్డిగారు చెప్పిరి.

అనంతరం మంత్రిగారు చెన్నూరు, పరిసర గ్రామములను తనిఖీచేసిరి.

మద్రాస్ షెరీఫ్‌గా నియమింపబడిన రామనాథం చెట్టియార్ గారు

### జీవనమూల్య పట్టిక

మదరాసు, డిశంబరు 10: ఆర్థికసలహాదారుని జీవనమూల్య పట్టీ మదరాసులో కార్మిక తరగతి మూల్యము నవంబరు 26 తో అంతమైన వారమున 327 సూచించుచున్నది. మార్పుఏమీ లేదు

## విశాఖజిల్లాలలో తుపాన్ పీడిత ప్రాంతాలలో గవర్నర్ పర్యటన

### నష్టాలను వివరిస్తూ ప్రజల విన్నపాలు: ప్రభుత్వం సహాయపడ-తుందని హామీ

విశాఖపట్నం, డిసెంబరు 10: మద్రాసు గవర్నరుగారు నిన్న యిక్కడకు వచ్చిన అనంతరం కొంతసేపు విశ్రమించి, స్వంతసిబ్బందితోను, జిల్లా కలెక్టరుగారితోను కలసి, యిటీవలతుపానువల్ల విపరీతంగానష్టపడిన అనకాపల్లిలోని పరిస్థితులను తిలకించటానికి బయలుదేరివెళ్ళారు.

మలకాపురంవద్ద గవర్నరుగారు ధ్వంసమైపోయిన పొలములను తోటలను చూశారు. తోటలలోని చెట్లన్నీ పూర్తిగా కూలిపోయినవి. వరదలవల్ల అక్కడిపైరులన్నీ పూర్తిగాధ్వంసమైపోయినవి.

గవర్నరుగారు సిబ్బందితో మోటారులో వెళ్లుతూ తాడి, దువ్వాడకైలుస్టేషన్ల వద్ద రైలుమార్గానికి పడినగండ్లను చూశారు.

అనకాపల్లి చేరినవెంటనే గవర్నరుగారు మోటారునుండి దిగి గౌరపాలెం, హరిజన వాడలకువెళ్ళి అక్కడి పరిస్థితులను పరిశీలించారు. తుపానువల్ల, వరదలవల్ల యీ ప్రాంతాలలో కలిగిన నష్టం విపరీతం. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు సయ్యద్ మహబూబ్ ఖాన్, కొడంబరి జోగారావు గార్లు అక్కడిప్రజలు తుపానువల్ల ఎటువంటికష్టములపాలైనదీ, ఎంతటినష్టంసంభవించిందీ గవర్నరుగారికి వివరించారు. గవర్నరుగారు కొన్ని దెబ్బతిన్న ఇండ్లలోకి వెళ్ళి చూశారు. ఇండ్లు నష్టపడినవారి కొక్కొక్కరికి రు.20చొప్పున సహాయం చెయ్యబడిందనీ, ఇండ్లు మరమ్మతు చేసుకొంటానికి యిది చాలదనీ, కనీసం రు 50 లయినా అవసరమనీ కలెక్టరుగారు వివరించారు

హరిజన సంఘంవారు గవర్నరుగారికి, స్వాగతపత్రం సమర్పించారు. సవర్ణహిందువులు హరిజనులపట్ల ఆదరాభిమానాలతో ఉంటున్నారనీ తుపానువచ్చినప్పుడు వారు హరిజనులకు ఎంతో సహాయం చేశారనీ గవర్నరుగారికి తెలియజెయ్యబడినది. గవర్నరుగారు ప్రసంగిస్తూ బాధితుల పట్ల సానుభూతి తెలియజేసి ప్రభుత్వం త్వరలోనే వారికష్టములు తొలగించుటకు తగు చర్య తీసుకోగలదని నమ్ముతున్నామన్నారు.

పైరులు ధ్వంసమైపోయినందుకు గవర్నరుగారు విచారం వెలిబుచ్చారు. ఆహారం కొరతగానున్న యీ తరుణంలో పైరు నష్టమయిపోవటం దురదృష్టమని గవర్నరుగారన్నారు. ప్రజలలోని వివిధ వర్గాల మధ్య సహకారభావం దేశాభివృద్ధికి దారి తీయగలదన్నారు.

ప్రజలలోని వివిధవర్గాలవారు కంట్రోళ్లు తొలగించే ఏర్పాటును ధాన్యం రవాణాపై నిర్బంధాలు లేకుండా ఉండే ఏర్పాటును చేయించవలసిందని గవర్నరుగారిని కోరారు. ఆహార ధాన్యంకొరకు విశాఖజిల్లా ఇతరజిల్లాలమీద ఆధారపడి యున్నదన్నారు.

అనంతరం గవర్నరుగారు శారదానది కట్టను పడినగండ్లను, శారదానదివలన తెనుకు కలిగిన నష్టమును, శారదనాది వంతెన, రైల్వేవంతెనమధ్య పడిన గండ్లను చూశారు. శారదా నదిపై మూడు ఆనకట్టలను మరమ్మతు చెయ్యటానికి ఉత్తరువులు పంపబడినవనీ, శాశ్వత మరమ్మతులకొరకు అంచనాలు తయారుచేయబడుచున్నవనీ, గవర్నరుగారికి తెలియజెయ్యబడింది.

జిల్లా కిసాన్ కాంగ్రెస్ సంఘం తరఫున వి. వి. రమణగారు వ్యవసాయ నీటి పారుదలలకు మరమ్మతులు వంటనే చేయించాలనీ, వరదాబాధిత ప్రాంతాలలోధాన్య సేకరణ నిలుపుచేయించాలనీ కోరారు.

కలెక్టరుగారు 2000 యకరాలకు సరిపడు విత్తనాలు, వ్యవసాయ పరికరాలు పంపకం చెయ్యటానికి ఉత్తరువు లివ్వబడినవనీ, కొన్నిచోట్ల పంపకం చెయ్యటం జరిగిందనీ గవర్నరుగారికి తెలియజేశారు.

మునిసిపల్ కార్యాలయంవద్ద తుపాను బాధిత సహాయసంఘ అధ్యక్షులు ఉప్పల వెంకటరమణయ్యగారు గవర్నరుగారికి పరిచయం చేయబడినారు. గవర్నరుగారి యీ పర్యటనలో అనకాపల్లి ఎం. ఎల్. ఏ. డి. వి. రామస్వామిగారు గవర్నరుగారివెంట ఉన్నారు. (స్వ. వి.)

### భావనగర్ మహారాణి

#### విశాఖపట్నంలో మహిళా గృహపరిశ్రమల కేంద్ర సందర్శనం

విశాఖపట్నం, డిసెంబరు 10: మద్రాసు గవర్నరుగారి సతీమణి, కలెక్టరుగారి భార్యలతోను, శ్రీమతి సత్యవతీ మహదేవన్‌లతోను కలసి, మహిళాగృహ పరిశ్రమల కేంద్రాన్ని దర్శించారు. అక్కడ వారికి బుర్ర కమలాదేవిగారు స్వాగతమిచ్చి, కేంద్రములోని వివిధ భాగాలను చూపించారు. కేంద్ర అభివృద్ధికి సహాయ … గవర్నరుగారి సతీమణికి పరిచయం చేయబడినారు. మహిళా యోగక్షేమ కేంద్రం వద్ద, శ్రీమతి అమ్మన్నరాజా, శ్రీమతి వి. సీతామహాలక్ష్మమ్మగార్లు గవర్నరుగారి భార్యకు స్వాగతమిచ్చారు. బాలికలు కోలాటప్రదర్శన గావించారు. ఇంతకుముందు మద్రాసు ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు కేంద్రమును దర్శించారు.



Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrik Press, No 7. Thambu Chetty St, Madras